# జయంతి

సంపుటము ౧ సంచిక ౫

సంపాదకుడు:

విశ్వనాధ సత్యనారాయణ, బి. ఏ.

# 'జయంతి' ఆలోచనా సంఘము

**సారస్వతము:—**

శ్రీ వున్నవ లక్ష్మీనారాయణపంతులుగారు, బారిష్టరు, గుంటూరు
,, వింజమూరి రంగాచార్యులుగారు, ఎం. ఏ; బి. ఎల్., ,,
,, ఇవటూరి కనకాచలం పంతులుగారు, ఎం. ఏ; ఎల్., టి. పర్లాకిమిడి
,, నండూరి వెంకట సుబ్బారావుగారు, బి. ఏ; బి. ఎల్., ఏలూరు

**ధర్మశాస్త్రము:—**

శ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, విజయనగరం
,, కిడాంబి రంగాచార్యులుగారు, ఎం. ఏ; బి. ఎల్., ,,
,, బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు, పర్లాకిమిడి
,, కావ్యవ్యాకరణతీర్థ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు

**లలితకళలు:—**

శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు, విజయనగరము
,, అడివి బాపిరాజుగారు, బి. ఏ; చెన్నపట్టణము
,, బెల్లకొండ రాఘవరావుగారు, పమిడిపాడు
,, పి. వి. రాజమన్నారుగారు, బి. ఏ; బి. ఎల్., చెన్నపట్టణము
,, గొడవర్తి రామదాసుగారు, బి. ఏ; ఎం. ఆర్. ఏ, యస్., జయపురము

**వార్తాశాస్త్రము:—**

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు, ఎం. ఏ; ఎల్., టీ. విజయనగరం
,, బసవర్సు రామచంద్రరావుగారు, ఎం. ఎ., కలకత్తా

**చరిత్ర - రాజనీతి:—**

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు, బి. ఏ; బి. ఎల్., రాజమండ్రి
,, వింజమూరి గోవిందరాజాచారిగారు, బి. ఏ; బి. ఎల్., చెన్నపట్టణము
,, కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు, బి. ఏ; బి. ఎల్., ,,

**భౌతికశాస్త్రము:—**

శ్రీ డాక్టరు. ఎ. ఎల్., నారాయణగారు, ఎం. ఏ; డి. ఎస్. సి.
,, డాక్టరు. జయంతి చినకామేశ్వరరావుగారు, ఎం. ఏ; డి. ఎస్. సి.
,, పాతూరి పట్టాభిరామయ్యగారు, ఎం. ఏ., ఎల్. టి.

**రసాయనశాస్త్రము:—**

డాక్టరు యేచూరి వెంకటరామయ్యగారు, డి. ఎస్. సి. విజయనగరము
శ్రీ కాళ్లకూరి సూర్యనారాయణగారు, ఎం. ఏ; ఎల్. టి., చెన్నపట్టణము
,, నుసర్ల రాజాగారు, బి. ఏ; బందరు

**ప్రకృతి శాస్త్రములు:—**

శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు, ఎం. ఏ; కొలంబో
,, డాక్టరు పుప్పల లక్ష్మణరావుగారు, ఎం. ఏ; డి. ఎస్. సీ; (జర్మనీ)
,, పురాణం సూరిశాస్త్రిగారు, బి. ఏ; బందరు
,, కొంతి పురుషోత్తముగారు, ఎం. ఏ; విజయనగరం.

# విషయసూచిక.

---

త్రివర్ణచిత్రము.




ఒకరొకరు చూచుకొనుచు, పండుకొనినాము
మా పరస్పరాలోకన ఘూర్ణములు
మా హృదయ మూలజీవమర్మములు కలచి
ఎగసికొను సుళ్లలో వలయీకృతమ్ము
లంతకంతకు విరళీకృతమ్ము లలలు
అమృతరసగర్భితములు మ మ్మావరించి
మాశరీరాంచలముల కంపములు పుట్టె
మా పెదవులందు చిరునవ్వు మాధురిల్లి
మాకొదవు పారవశ్య సంభ్రమమునందు
ఒకరొకరి నేత్రయుగళి మూసికొనినాము.

నాయని సుబ్బారావు,

# ఒక యనుభూతి

వచ్చి ఝంఝామరుత్తులవలె మదీయ
హృదయగోళమ్ములో కదలించివైచు
రేగి ప్రళయాగ్నికీలల రీతి నాడు
తరుణ హృదయమ్ములోపలఁ దగులఁబెట్టు
కామమును క్రోధమునుద్ఘూర్తగతులు చూపి....
అవి యథేష్టమ్ముగా నాహృదంతరమున
సంచరించి యేనాటికో సంత్యజించి
పోవు
        ఒక యనుభూతము పూని వదలి
పోయినప్పటి మానిసి పోలె, పరశు
రామసంప్రీతి యయిన కుగ్రామమువలె
హృదయరక్తమ్ము నాళాంతరిత జవమ్ము
తోడ పీల్చు విషజ్వరోద్ధతత తగ్గి
పోవునప్పుడు వలె,
                                        క్రుంగిపోవుచుండు
నాప్రాణాలు, వచ్చి, ఆనాడు దినము
దినము, నాపైన కొన్నాళ్ల—

విశ్వనాథ సత్యనారాయణ

# నాగుల చవితి

నీపుట్టదరికి నాపాప లొచ్చేరు,
పాపపుణ్యమ్ముల వాసనేలేని
బ్రహ్మ స్వరూపులౌ పసికూనలోయి!
కోపించి బుస్సలు కొట్టబోకోయి !
నాగుల్ల చవితికి, నాగేంద్ర, నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి ! 1

చీకటిలోన నీ శిరసు తొక్కేము,
కసిదీర మమ్మల్ని కాటెయ్యబోకు,
కోవ పుట్టలోని కోడెనాగన్న !
పగలు సాధించి మాప్రాణాలుదీకు !
నాగుల్ల చవితికీ, నాగేంద్ర, నీకు
పొట్టనిండా పాలు పోసేము, తండ్రి ! 2

అర్ధరాతిరి వేళ అపరాత్రివేళ
పాపమే మెఱుగని పసులు తిరిగేని,
ధరణికి జీవనాధారాలు సుమ్మి !
వాటిని రోషాన కాటేయ బోకు !
నాగుల్ల చవితికీ, నాగేంద్ర, నీకు
పొట్టనిండాపాలు పోసేము, తండ్రి ! 3

అటుకొండ యిటుకొండ ఆరెంటినడుమ
నాగుల్లకొండలో నాట్య మాడేటి
దివ్యసుందరనాగ ! దేహియన్నాము !

కనిపెట్టి మమ్మెపుడు కాపాడవోయి !
నాగుల్ల చవితికీ, నాగేంద్ర, నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి ! 4

పగలనక రేయనక పనిపాటులందు
మునిగి తేలేటి నా మోహాల బరిగె
కంచెలూ కంపలూ గడచేటి వేళ
కంప చాటున నుండి కొంపదీకోయి !
నాగుల్ల చవితికీ, నాగేంద్ర, నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి ! 5

బసవరాజు అప్పారావు.

# తల్లి

చుక్కల నడుమగా
చూడరా యేముందో
చక్కని నీవంటి
చందమామ ముండిరా
ప్రక్కచుక్కలతోటి
పక పకా నవ్వుతూ
ఏమిటో చెప్పేది
యెఱుగుదువా! చిట్టి!

అమ్మమాటే వినదు
అల్లరివాఢంటు
చిట్టి నీసంగతే
చెప్పుచున్నాదిరా?
జుట్టు దువ్వించుకో
బొట్టుపెట్టించుకో
నిన్ను చూచే తాను
చిన్నబోతుందిలే

బెల్లంకొండ కనకమ్మ.

# ఓ చెలీ!

ఓచెలీ! నీస్వభావముం దార్కొనకపుడు
గాఢ ఝంఝామరుత్తరంగములు కలవు
నీయెడ చలించు మలయాద్రినిభృతవాయు
శీకరార్ద్రమ్ముగ వాని నోర్చెదను నేను.

ఓచెలీ! నీస్వభావముం దార్కొనకపుడు
ఘనతరాంభశ్శిలావర్తకములు కలవు
నీయెడద నూగు చిన్నారి నీటికాల్వ
చిఱుతరగ లెంచి వాని నోర్చెదను నేను.

ఓచెలీ నీస్వభావముం దార్కొనకపుడు
ప్రళయమార్తాండ తీక్ష్ణాతపములు కలవు
నీయెడందలేమావుల నీడ లోలయు
శీతలత్వాప్తి వాని నోర్చెదను నేను.

ఓచెలీ! నీస్వభావముం దార్కొనకపుడు
నాల్క తడి యార్చు తుషారవార్దదులు కలవు
నీయెడద నాస్యతో దర్శనీయమాధు
సింధువుల నెంచి వాని నోర్చెదను నేను.

విశ్వనాథ సత్యనారాయణ.

౪-౨-౭

# విరహతోరణము

వినరా పీవిభావరీ
వేలా కాలల నీమృదు
వసనాంచలముల గుసగుసలో,
మసలు చరణ మంజీరము
కొసరు జాలిపలుకరింతలో!

ఈకటీరముఖద్వార
మిందే వ్రేలాడి, సగము
వాడి, విరహతోరణమ్మునై
వలపంత సడలి, నేల జీ
రాడి, యెన్నినాళ్లు మనుదునో!

ఇపుడు వత్తువా, నీకొఱ
కెదురు చూచు దాసురాలి
యెడంద మంచుజడులు కురియునో!
మాపేమో! రేపేటికో
వెడలిచనునో! నిదుర మునుంగునో!

ఆర లేని నాకోరిక
కారుచూపు చొరంగఁ, జీలి
కాలి కుములు ఈచీకటిలో
క్రాగి క్రాగి నీకొఱకై
కరవులోన నే నశింతునో!

నీమనోజ్ఞ కాంచన కాం
చీమణి ఘంటా గళములు

ఏకాంతము కరగ, మ్రోయగా,
విన, నరచే బ్రతుకు వాల్చి,
ఎడద మ్రోలి కెంత యేమౌనో !

ఈ వియోగ నిరాశాతు
రతుణ ప్రతీక్షించెదఁ.
ఎగసి ఎగసి పగిలి పోదునో !
పగలెరుగని ప్రవాసమున
కిక వేకువరేఖ విరియదో !

ఆకస మాలోకనముగ,
లోకమెల్ల వీడఁగ, శా
లాంతమునకు కాచియుందునా !
ఆసలేని ఆసకు ప్రా
ణాంతమేని వేచియుందునా !

చివురింపదో చైత్ర శుభో
త్సవ విభాత కల్యాణము
ఈ శిశిర హేమంతమున—

దేవులపల్లి కృష్ణశాస్త్రి

# పూజాపుష్పములు.

నాదు మోహప్రపంచాన నడచి రూప
ములను గొనకుండ చనుభావములను పోల్చ
వచ్చునెదలోన నిండి త్రపామధురిమ
మలగి వెలిరాని కన్నె ప్రేమమ్ముతోడ.

ఈయనంతావకాశాన నిమిడి క్షణము
క్షణమునకు ప్రబోధించు నీశ్వరమహత్తు
నను చలింపని బండనో నన్ను భావ
గీతిగరుగని శిలపాటిఁ గేరవచ్చు.

త్వన్ముఖచ్యుత మధుర సంతాన మసృణ
కిరణములఁ నోగుకోర్కి గ్రుక్కిళ్లు మ్రింగు
నేను నుపమింప నగుదు పక్షిసమీక్షు
ణముల వరు డూహసేయు నన్వయముతోడ.

నిను సమీపదూరస్థుఁ గన్గొనినయంత
నాదు హృదయంబుగనుస్పందనముల నెల్ల
దూరముననాటవస్తువు చేయనెంచు
తక్షటదుగులతో సరి చెప్పవచ్చు.

నూతపనేని రామగోపాలరావు.　　　　ముక్కేవి లక్ష్మీనరసింహరావు.

# బ్రహ్మగీతము.

వేణువు బ్రహ్మగీతము చెవింబడెనో స్మృతిపోయి గోపికా
శ్రేణులు నీ కరం బభిలషించిరి గేహములున్ తనూజులన్
ప్రాణపతుల్ తదీయవిరహాగ్నికి నేమయినాగాం ఎంత పా
షాణుడవో పురానుగతసంధులు వ్రయ్యలు సేయ మాధవా!

దోసదోసజాలు బాష్పములు దోసిటఁబూని భవత్పదాభిషే
కనియతి నమ్ముచున్న వ్రజకన్యలు బృందావనము [illegible]వ తప్పిగో
యని మదినైననెంచ వవురా తరిచిన్న [illegible] సమ్మపాలు త్రా
విన చిఱుబొజ్జలో కలకవెట్టదురా! జగదేకసుందరా!

మధురమురా మురాసురవిమర్దన! నీదగు బ్రహ్మగీతి నీ
యధరసు రా! పురాకృత మహాసుకృతమ్ము గడించుకొన్న దీ
ర్ఘక్షనవమేఖలల్ వ్రజవిలాసిను లంబుధరాకృతీ! నినున్
[illegible] వచ్చిరిరా! వ్రజేశ్వరా!

ముహురుపహృబ్రహ్మనసికి మోహాలు వీడిరిపో నిజేసులన్
గృహములు వచ్చిరా పలుకరించవు కొంచెపుచూపుచూచు ని
స్స్పృహపడవయేని ఇట్టు లధరీకృత గాంగరుచాలుబు గీతికా
[illegible] నేల చేసెదు [illegible]ప్రతిపాలన సత్క్రియాచణా!

ఎదురుగ వచ్చిన స్వాగతము నిచ్చితో సాచి సవస్మితాస్యసం
పద [illegible]మ్ము వాడసగపాలు నోసంగితో ఏమిలేని సీ
మొ[illegible] ఇంతనా పరుషమెత్తుచు వచ్చిన వెఱ్ఱిగొల్లలీ
మద[illegible] లెంతకెంత కభిమానము వచ్చిరిరా వ్రజేశ్వరా!

నును జివురాకు తీపులు కనుంగొనలన్ మెలివెట్టి గాలితా
కున కదలాడుకన్నెల గఁపొన్నఁపుపుల్ మదనార్థగామిగాఁ
గనుచుఁ దమాలపల్లవశిఖాచలనంబునఁ గామినీత్రపా
ఖనులను త్రవ్వి చూఱగొను కవ్వని నీ సొగసెంతచక్కనో!

ఈరసనిమ్నగల్ పరువులెత్తి కళిందసుతా సమీప కాం
తారమునందు పాయలయి త్రాచులపోలిక ప్రాకుచున్ ఫణా
వారము లెత్తుచున్ గొలువవచ్చెడు చిత్రముగా రసార్ద్రవాః
పూరమయాకృతుల్ భువనముగ్ధకిశోరుని నందనందనున్.

విశ్వనాథ సత్యనారాయణ.

# చిన్నవాడ!

కన్నె గన్నేరు వలయునా! చిన్నవాడ
సౌరభమ్మును వలతో! పేశలత వలతో!
కవిహృదయ మాహరించిన కన్నెపూవు
గానములే నీకు మది దానఁగొలిపె నేమొ.

తొగరుచాయల లేనవ్వుజగి హసించి
కమ్మతావుల తేటలు కలక తేర్చి
పుణ్యాగేహాని గన్నెరు పూచె దీని
సిగ్గుగొనకుము కైకొమ్ము చిన్నవాడ!

నీకపోలమ్ములందు గన్నేరుపూలు
కల వయిన వాని కేతావి కలుగ దిపుడు
సొగకనుఁగోయి యరమోడ్పు సోయగమ్ము
లెంచు నాటికి విచ్చు వాసించుగాని.

పుర్వాడ శేషగిరిరావు. చోడవరపు జానకిరామయ్య.

# కిన్నెర సంగీతము.

కోన లన్నీ మురిపించుకుని వచ్చు సెలయేటి
చాన కిన్నెరసాని జలజలా స్రవియించు
తరగలో, పై కెగయు
నురుగులో, క్రొంగ్రొత్త
తేనె కాలువ లూరెనో, అమృతంపు
వాన చినుకులు జారెనో.

తేన తరగల పింపితోన జలజల సాగు
చానకిన్నెరసాని జాలైన మేలైన
వాకలో, అందాల
రాకలో, బంగారు
జలుగు గంటలు మ్రోగెనో, చిన్నారి
బిగువు నవ్వులు సాగెనో.

తేనెలై కలకండ సోనలై వానలై
చానకిన్నెరపాట సాగులాడుట చూచి
చివరలో, చివురొత్తు
నవ్వురులో, క్రొమ్మావి
వింతగా సిగ్గందెనో, కోకిలా
గొంతులో కదలాడెనో.

చెలికిపాసక మెత్త జీరపాకము వోలె
తరుణి కిన్నెరపాట తొంగు లాడుట చూచి
పువ్వులో, లేనంజ
రువ్వులో, దానిమ్మ

తెలతెల్లనయిపోయెనో, క్రొంజిల్క
పలుకులో పస తప్పెనో.

ప్రొద్దుకాకల జాతిపోవు మంచును వోలె
పొలతి కిన్నరపాట పొంగిపోవుట చూచి
నీటిలో, కిన్నరా
పాటిలో, అడవిలో
తోగుల్లు పారాడెనో, క్రొంజలువ
వాగుల్లు సాగాడెనో.

పికిలిపిట్టల యీలలకు క్రొత్తసాటిగా
సకియకిన్నెరపాట జముగులాడుట చూచి
సామములో, చిఱువెచ్చ
జాములో, మెల్లగా
పగలు పులకలు పొందెనో, మల్లెలా
సొగసు వెలుగులు చిందెనో.

తొలి వెన్నెల చివుళ్ల తెలిసిగ్గు విరజిమ్మ
వెలది కిన్నెరపాట పిలిచి పోవుట చూచి
తెలుపులో, వెన్నెలా
మలుపులో, రేచాన
సిరివెల్లి పచరించెనో, విరిపూల
సెజ్జ తావి తర మించెనో.

తలిరాకు కన్న మెత్తని యందమును వోవు
తరుణి కిన్నెరపాట తానమాడుట చూచి
ఎరపులో, ఆనంద
జలధిలో, లోకాలు
పులకితమ్మయి పోయెనో, సకలాత్మ
చులుకితమ్మయి పోయెనో.

చిఱుత తంగెటి జుంటి జీబు చిక్కనలోని
చిన్ని కిన్నెర పాట జీరసాగుట చూచి
పూవులో, తేనెల్ల
చాలులో, క్రొందేట్లు
కదలు లాడుట మానెనో, వాకపై
పదువులై పరువెత్తెనో.

ఒకసారి సన్నగా, ఒకసారి పెన్నగా
ఉప్పొంగ కిన్నెరపాట యొయ్యారములు చూచి
కళ్లలో, లేపచ్చ
మళ్ళలో, పసిలేళ్లు
బెదరుచూపులు చూచెనో, మైనిగల్
నడచుగా కనిపించెనో.

అంచకన్నియ యెల్గు అడవిసాగినయట్లు
అతివకిన్నెరపాట అతిసన్నగిలిపోవ
పొరలలో, సనసన్న
తెరలలో, చిఱుగాలి
ఆపాట సాగించెనో, వృక్షాల
తోపాటు పాగించెనో

అందకత్తెల జిల్గు టందె మ్రోసినయట్లు
చింది కిన్నెరపాట జలుగుల్లు వోవగా
కూతలో, లేతమ్మి
మేతలో, రాయంచ
లొండొంటి ప్రేమించెనో, సింగార
ముండి కలయిక పొందెనో.

ఏటి కిన్నెర పాట ఎగిరెగిరి మిన్నంది
సాటితారలనడుమ చాలుగా నిరవొందు
దవ్వులో, జాబిల్లి
నవ్వులో, క్రొక్కారు

తలిరు పూవులు చిమ్మెనో, చొక్కంపు
తెలుగు వెలుగులు క్రమ్మెనో.

కంచు గీసినయట్లు కదలు తరగలగోస
మించి కిన్నెరపాట మేలి షోకలు పోవు
నిగ్గులో, అందంపు
జగ్గులో, వనమెల్ల
ఒకపాట యయి పోయెనో, తను తాన
యెఱుగలేకే పోయెనో.

ముద్దుముద్దుగ నడచి ప్రోడవోలిక నాడి
మురిపెమ్ముగా పాడి ముగుద కిన్నెరసాని
యెడదలో, ఎన్నైన
కెడదలో, కష్టాల
కడలియే కలగాంచెనో, కన్నీటి
కడవలే ప్రవహించెనో,

విశ్వనాథ సత్యనారాయణ.

# కృష్ణ రాయబారము.

శ్రీ వున్నవ లక్ష్మీనారాయణగారు

౨

మొదటివ్యాసములో కృష్ణుడు రాయబారమునకై బయలుదేరుటకు తానే నిశ్చయించుకొనెననియు, భీమార్జున నకులులందుకై మిక్కిలి సంతసించి కృష్ణుని సంధికుదుర్చుకొని రమ్మని పురికొల్పిరనియు ద్రౌపది మొదట కొంత వ్యతిరేకభావము జూపినా తుదకు సంధికియ్యకొనెననియు సహదేవుడుమాత్రము ప్రతిఘటించెననియు చెప్పియుంటిమి. సంధికిబోవు విషయమై ధర్మజుడు ఉత్సాహమును గనుపరుపక

మేలుగాక నీకు బోలినట్లయిన నం
దరిగి యేము వార నర్థిబొంది
యుండునట్లుగాగ నొడబాటుగావింపు

మని మాత్రమన్నాడు. నీకు యుక్తమనితోస్తే. సంధికి వెళ్లుమన్నాడు. కృష్ణునితో ధర్మరాజు అన్న యీవాక్యము మామూలుగ ఎంతో భావగర్భితముగ నున్నది. పోవలసినదని ఆయన కోరలేదు. సంధి కుదురునను ఆశ ఆయనకు కలుగలేదు. స్థితప్రజ్ఞుడయిన ఆధర్మమూర్తికి అసత్యము గోచరించునా? యుద్ధము జరిగి కౌరవపక్షవినాశము గావలసియుండగా సత్యనిరతుని మనోవాక్కులనుండి అసత్యమెట్లు వస్తుంది?

ఇంతేకాక ధర్మరాజున కింకొక సందేహముకూడా వున్నది. సత్యనిరతుడైన ధర్మజునకు రాబోవు మఱియొక సత్యముకూడ బొడగట్టినది.

నీవు నుయోధనుపాలికి
బోవగవలదనియు నొక్కబుద్ధి వొడమెడున్
గోవింద యతడు మంత్రులు
గావలయున జక్కవినరు కార్యవచనముల్

కుటిలమతు లవినీతులు క్రూరకర్ము
లట్టి నీచుల కడకు-ని న్ననుపజాల
నీవు సంకటపడియెదు దేవపదవి
డైన నే నొల్ల నొంటి యాందరుగు టుకుగు.

ఆహా! ధర్మరా జెంతదూర మూహించగలిగినాడు ! కృష్ణరాయబారముయొక్క ఉద్దేశ మాయనదాచలేదు కృష్ణుడు తాను సంధి కుదిర్చెదనని పాండవుల కాసలు బెట్టలేదు. తానుసంధికై పురుషప్రయత్నము జేయుచున్నాననీ దైవనియతిచే ప్రయత్నము విఫలమగుననీ స్పష్టముగా సూచించినాడు. ఈసందర్భమున మొదటివ్యాసములో నుదహరించిన పద్యములు జూడవచ్చును.

ఈప్రయత్నములో దైవనియతియేమి? మన సాధారణదృష్టికి గనబడువారు 18 అక్షౌహిణుల సైన్యములు, సేనాపతులు, అక్షౌహిణీపతులు. ధృతరాష్ట్రుడు తేపా యీలెక్కలే వేసినాడు. మన సైన్యములయొక్కయు పాండవ సైన్యములయొక్కయు బలాబలములు జెప్పుమని యడుగగా దివ్యబోధనుండయిన ద్వైపాయనుని సమక్షమున సంజయుండిట్లు నిర్ధారణ చేయగలిగినాడు.

ఆసేనకు నీసేనకు
వాసి యడిగెదేవు నన్ను వసుదేవసుతుం
డాసేన గలడు తత్సము
నీసేనం జూపు మానవేశ్వర నాకున్

వ. వాసుదేవుని చక్రంబు నిజమాయాబలంబున పాండవుల సర్వసమర సాధనంబుల సూక్ష్మరూపవ్యాపియై నిలచి వారికి జయం బొసంగుచుండు

పలుమరు పాండుతనూజుల
గొలది వితర్కించెదవు గూఢం బదియుం
దెలియంబలికెద వారికి
బలమును సత్వంబు హరియ పార్థివముఖ్యా

అందుపై ధృతరాష్ట్రుండు పెద్దయుంప్రొద్దు విచారించి కౌంతేయుల శక్తి దైవశక్తియు గాంధారేయులశక్తి మానుషశక్తియునుంగా దెలిసినవాడై నిజనందనునితో నిట్లనియె. అగ్నిదేవుడు గాండీవమును, అక్షయ తూణీరమును కపికేతనము మున్నగు సమర పరికరములన్నియు అర్జునున కిచ్చియున్నాడు. ధర్మదేవతయు వాయుదేవుడును వాసవుడును అశ్వినులును వారికి పాండురాజుతోడివారు. వారికి ఒకకీడును బొందయకుండ రక్షింతురు. భీష్మద్రోణప్రముఖులకు పాండవుల పరిభవింపరామి తెల్లము. ఎన్నిభంగుల జూచినను శయ్యాముదుగుట కర్తవ్యమని బోధింపగా దుర్యోధనుడు తండ్రితో

దేవత లర్జునునకు దో
డై యుత్తరునంగ వలవ దని యెట్లనినన్
దేవత్వము రాగద్వే
షావేశము లేమిగాదె యైనది మొదలన్

కావున దేవత లొకళ్లొకళ్లవారుగారు. అట్లుగాక పక్షపాతులై పూనివత్తురయేని నది దేవత్వంబుగాదు. అట్టి దేవత్వంబున సర్జునుండును సురక్షితుండు గానేరడు. నీవు నాపనికి చింత వలవదు. అదియునుంగాక నాకెన్నయేని యతిమానుషశక్తులుగలవు. నీచెప్పిన అగ్ని ప్రముఖదేవతులు ప్రసన్నులగునట్లుగా నారాధించినవాడ

ఏ నలిగినవారిని సుర
లైనను రక్షింపనోప గమరు లలిగినం
బూని చెడకుండగాతును
మానవు లోకసరకె నాకు మనుజాధీశా

గర్వమున నాడు మాటలుగా దలంప
వలన దిదియెల్ల నిక్కంబు నను మహీశ
నన్ను నే జెప్పికొందు నే యెన్నడైన
నాత్మసంస్తుతి పౌరుషమానె చెపుమ.

కిడపటి రెండు పద్యములలోని దుర్యోధనుని వాక్యము లాతని దృఢ నిశ్వాసమునే వెల్లడించుచున్నవి గాని డంబమును వెల్లడించుటలేదు. దుర్యోధను డుత్తమక్షత్రియుడు, మహావీరుడు, పౌరుషశాలి, అమోఘములైన రాజ్యతంత్రము లెరిగినవాడు, బలరామశిష్యుడు, గదాకౌశలమున భీమునికి మిన్నయని నిశ్చయముగ జెప్పవచ్చును. భీమునకు బలమెక్కువయినను దుర్యోధనుడు వజ్రశరీరి: రారాజై మహోత్కృష్టముగ రాజ్యమును పాలించినవాడు. ఒక్క పాండవులయెడదప్ప అతడెవ్వియు దోసము లొనర్చినట్లు గన్పట్టదు. ఒక్క ద్రౌపదీ మానభంగ విషయమునదప్ప అతనిచర్య లెవ్వియు రాజధర్మములబట్టి విమర్శించినచో దూష్యములనుటకు వలనుపడదు. ఆయన రాజ్యపాలనా పద్ధతి పరికింతుమేని ప్రాయోపవేశ సమయమున దుశ్శాసనున కతడు గరపిన రాజనీతి భీష్మ యుధిష్ఠిరుల పాలనమునకు గొరవడదు. అప్పటి ధర్మ

శాస్త్రము లుత్తమమని బోధించిన పాలనాపద్ధతినే యత డనుసరించిన ట్లీ క్రిందిపద్యమువలన తెలియగలదు.

అన్నదుశ్శాసన నిన్ను రాజ్యమునకు బట్టంబు గట్టెద నతివిగమ్ము
శకుని కర్ణులు దీర్ప ప్రకట వసుంధరావలయ మంతయు మహోజ్జ్వలత నేలు
భ్రాతృవర్గమునకు బ్రీతిసేయుము బంధుజనుల బోషింపుము సద్విజాలకు
నుత్తమంబుగ వగువృత్తులు సెల్లింపు గురుజనంబుల భక్తిగొలువు మెపుడు
నింద్రు డమరగణంబుల నేలునట్లు
ధరణి పతుల నేలుము బాహుదర్ప మొప్ప
బగర నుక్కడగింపుము పరమమిత్రు
లైన శూరుల గొనియాడు మర్హభంగి.

ఇట్టి రారాజు-కృష్ణభీమార్జునుల పూర్వచరిత్రము లెరుంగనివాడు- తలిదండ్రులు గురుపితామహులు మహర్షులు బోధించినను వినక సమర భంగికే పట్టుబట్టియుండుటకు కారణ మేమని యూహింపగలము? ఏమ యిన సందేహములున్నను ఉత్తరగోగ్రహణమునాటి పరాభవకథ యాతని కన్నుల నేల దెరిపిడి సేయలేదు? దీనికి దేవరహస్య మేమయిన గలదా? రాక్షసరహస్యమున్నను సంతసమే. ఏదో యొకరహస్యముండి తీరవలయును. రహస్యమును వెలిబరుచుటకు అరణ్యపర్వములో దాగి యున్న ప్రాయోపవేశకథకు బోవుదము.

రామాయణ భారతములలోను, పేరుగన్న ప్రపంచ చరిత్రము లన్నిటియందును, వేయేల ప్రకృతిచరిత్రములోని ప్రతి అధ్యాయమునం దును సత్యాసత్యములు ధర్మాధర్మములు బోరుచుండుటయు తుదకు సత్య ధర్మములు విజయము గాంచుచుండుటయునే మనము గాంచుచున్నాము. ప్రతిపోరాటమునందును ఒకవైపున సత్యమును మరియొకవైపున అసత్య మునే బోరుచుండినవని చెప్పవలనుపడదు. ఐరోపాసంగ్రామమే దీనికి తార్కాణము. ఈమహాయుద్ధములో నుభయపక్షములును స్వార్థపరతచే పెచ్చుపెరిగి పశుబలము లొండొంటితో బోరి నశించి లోకకళ్యాణము నకు తోడ్పడినవి. రామాయణములోవలెగాక భారతమున సత్యాసత్య ముల పోరాటము వర్ణింపబడినదని స్పష్టముగ జెప్పవలనుపడదు. రామ

రావణయుద్ధములో విభీషణునకు అసత్యపక్షమున బోర చోటులేకపోయినది. కపిసైన్యములకెల్లను రావణపక్షమువారితో తమ స్వాంత విరోధములుగాని రామపక్షమున స్వాంతస్నేహములుగాని లేవు. వాల్మీకి అచ్చుదీసినట్లు ఏకపక్ష కాకపక్ష విడదీసినాడు. కాని భారతయుద్ధములో కౌరవపక్షమువారందరు దుర్మార్గులనిగాని పాండవపక్షము వారెల్లరు సన్మార్గులనిగాని చెప్ప వలనుపడదు. రామపక్షమున నొక్క కోతిపిల్లయు సమరమున చనిపోలేదు. రావణపక్షమున నొక్కరక్కసుడును మిగులలేను. కాని శ్రీకృష్ణుడు స్వపక్షపరపక్ష నిర్ధూమధాముడు. భారతములో ఘటోత్కచుడు చనిపోయినపుడు శ్రీకృష్ణు డానందముతో తాండవమాడినాడు. బుద్ధిపూర్వకముగ నర్జునుని తొలగదీసి మేనల్లుడయిన అభిమన్యుని జంపించినాడు. పంచపాండవులను తొలగదీసి ఉపపాండవులతో సహా పాండవసైన్యమునంతను అశ్వత్థామచే భస్మీపటలము గావింపజేసినాడు, కాని అశ్వత్థామను జీవచ్ఛవమును గావించి మిగిల్చినాడు. పాంచాలురకును కౌరవపక్షమున ప్రముఖులైన భీష్మద్రోణులకును గల విరోధము కౌరవ పాండవుల విరోధమునకంటెను చాల పురాతనమైనది. యుద్ధప్రారంభమువరకును కేకయు లెటుగలియునదియు నెవరు నెరుగరు. శల్యుడును అతని సైన్యములును కౌరవుల జేరుట కేవల మప్రశస్తము. వాల్మీకియైనచో భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలను పాండవులవైపుకు నెట్టి విదురుని చేత పాండవపక్షమున కత్తిబట్టించి యుండును. అదియునుగాక పోరునకు మూలకారణమయిన దాయభాగవిషయమున ఏది సత్పక్షమో ఇదమిద్ధమని నిర్ధారణచేయ వలనుపడదు. మఱియును యుద్ధమునకు పూర్వపు టధర్మములు చాలవరకు కౌరవులవనియు, యుద్ధకాలములో నివి పాండవులవనియు స్పష్టముగ జెప్పవచ్చును. భీష్మ ద్రోణ భూరిశ్రవ కర్ణదుర్యోధనుల వధలలో మన నల్లదేవుని కృత్యములు పాండవపక్షము వారికే వెగటుగా దోచినవి. చివరకు పంచపాండవులను సహితము మిన హాయించక ధర్మజునిచే నసత్యమాడించి యమలోకమునకు గొని పోయియు, అర్జునుని దుర్బలునిగావించియు, భీమార్జునాది సోదరులను

ద్రౌపదిని సహితము నరకమున బడద్రోసినాడు. అబలయునైయైనను మన్నింపక పుత్రశోకాతురయగు గాంధారిచే తన్ను శపింపజేసుకొని యామె తపస్సును సన్నముజేసినాడు. కృష్ణా ! నీవుగదా రాగద్వేషవిరహితుడవు. సత్యాసత్య ధర్మాధర్మాది ద్వంద్వములకెల్ల నతీతుడవు. నిన్ను విమర్శింప నేరికి తరము?

అనగా భారతమున సత్యాసత్యపక్షములని విడదీసి లేవు. ఇరుగడలా ఎడాపెడాగొట్టి క్షత్రియజాతి వినాశము గావింపబడినది. క్షత్రియ యుగము పోయినతరువాత శూద్రయుగము ప్రారంభమయినది. శూద్రరాజన్యులప్పటినుండియే బయలుదేరిరి. భారతయుద్ధము ఐరోపా సంగ్రామములోవలె ఉభయపక్షములను జేర్చి నశింపజేయుట మూలముగా తేలిన సత్యాసత్యముల పోరాటమనియే చెప్పవలసియున్నది. ఉభయపక్షములయందును దుర్యోధనున కొక్కనికే తెలిసిన రాక్షస రహస్యమేది?

భూదేవియొక్క ప్రజాభారపీడనము తొలగించుటకై దేవదైత్య దానవమునియక్షరక్ష.గంధర్వాదుల యంశంబులుదాల్చి భీష్మాదివీరులు జన్మించి భారతయుద్ధంబుజేసి ప్రజాక్షయము గావించిరనియు

అతుల బలాఢ్యులై న యమరాంశ సముద్భవులెల్ల పాండు భూ
పతి సుతపక్షమై సురవిపక్ష గణాంశజులెల్ల దుర్మదో
ద్ధత కురురాజపక్షమయి ధారుణిభారము వాయ ఘోరభా
రతరణభూమి నీల్గిరి పరస్పరయుద్ధముచేసి వీరులై

అని పాండవపక్షమువారు దేవాంశసంభూతులనియు కౌరవపక్షమువారు రాక్షసాంశసంభూతులనియు చెప్పినను కౌరవపక్షమున ముఖ్యులయిన ధృతరాష్ట్ర భీష్మద్రోణ కృపకర్ణాదులు దైవాంశసంభూతులని చెప్పబడుటచేతను పాండవపక్షము వారలలో ననేకులు రాక్షసాంశం బుట్టినవారగుటచేతను ఒకపక్షము వారు రాక్షసాంశసంభూతులనియు రెండవపక్షమువారు దేవాంశసంభూతులనియు స్పష్టముగా చెప్పుటకు వలనుపడదు. ఈ కురుక్షేత్ర సంగ్రామకారణకథయంతయు

దేవరహస్యము. భూభారమును తగ్గించడమునకు యుద్ధము చేస్తున్నా మని ఉభయపక్షములవారికిని తెలియదు. క్షత్రియులయొక్క సుపరి పాలనమువలన పెచ్చుపెరిగిన జనసమూహమును నశింపజేయుటకై దేవ దానవాంశముల తాము జన్మించితి మని వారెరుగరు. ఈవిషయము అప్పటికి దేవలోకములోని దేవతలకు మాత్రము వెల్లడియైనది. తరువాత త్రికాలజ్ఞులయినవారు గ్రంథములో వ్రాయుటచేత మనకు తెలిసినది గాని ఇది పాండవపక్షమున కృష్ణుడికి మాత్రము తెలిసి ఉంటుంది. దుర్యోధనుడికికూడా ఈరహస్యములో కొంతభాగము మాత్రము తెలిసింది. ఉభయపక్షములా పోరిన తక్కినవారందరు కౌరవపాండవుల చిన్ననాటి జట్టీలు లాక్షాగృహదహనము జూదములు ద్రౌపదీ మానభంగము వన వాస అజ్ఞాతవాసములు భాగపంపిణీలు మాత్రమే యెరిగి యెవరిపక్ష మున కనుకూలముగా వారు ఆయాకారణముల చర్చించుకొనుచుండిరి. వారు కాంతాకనకములు మాత్రమే కురుపాండవ యుద్ధమునకు కార ణములని భావించుచుండిరి.

కృష్ణునకు దేవరహస్యము మొదటినుండియు సంపూర్ణముగ తెలిసి ఉంటుంది. దుర్యోధనున కట్లుగాదు. తన ప్రాయోపవేశకథ జరుగువరకును ఏరహస్యమును అత డెరుగడు. దుర్యోధనుడు పాండవులు ద్వైతవనములోనుండగా ఘోషయాత్రకు బయల్వెడలుట గంధర్వు లాతని జయించి చెరగొనుట అంతట భీమార్జును లది విని యుద్ధముపోయి గంధర్వరాజు నోడించుట గంధర్వరాజయిన చిత్రసేనుడు ధర్మరాజు నొద్దకువచ్చి యాతని కోర్కెపై దుర్యోధనుని చెరవిడిచి పంపుట మొదలుగాగల ఘోషయాత్రకథ మన మెఱిగినదే. దుర్యోధనుడు కృత జ్ఞుడు కావడమునకు మారుగా తాను ఘోషయాత్ర రావడమూ గంధ ర్వులు తన్ను చెరగొనడమూ ధర్మరాజు సహాయమున విడుపుగనడమూ తన పౌరుషమునకు దుర్భరముకాగా ప్రాయోపవేశముజేసి ఆత్మహత్య గావించుకొనుటకు పూనుకొన్నాడు. ఎవరు వద్దని చెప్పిననూ వినలేదు. ఆత్మహత్య గావించుకొనుటకు శుచియై సమాధిలో ప్రవేశించియుండగా

దేవతలచే నోడిపోయి నాగలోకములో వేచియున్న రాక్షస లోకమంతయు దుర్యోధనుడు ప్రాయోపవిష్టుడై యుండడము తెలుసుకొని శుక్రుని సహాయముతో కృత్య నొకదానిని సృష్టించి పంపగా నది దుర్యోధనునిబట్టి తెచ్చి రాక్షసుల కొప్పగించినది. అంతట వారందరు

"నీవు మనుష్యమాత్రుండవు గావు
ఏము తపంబుజేసి పరమేశ్వరు నీశ్వరు బార్వతీమనః
కాముకు గామవైరి నవికారు జరాంతకు బ్రీతుజేసినం
గామితదాయియైన సితికంఠుడు నిన్నుసృజించి యిచ్చె ను
ద్దామదయావిధేయుడు ముదంబున మాకు వరేశ్వరుండుగాన్

నీవు ధరిత్రి బుట్టుటయు నీకు సహాయత సేయగోరి నా
నావిధ దైత్యదానవ గణంబులు రాజకులంబులందు స
ద్భావన నుద్భవించె బటుబాహులు దివ్యమహాస్త్రకోవిదుల్
ద్రావితవైరు లుర్వి భగదత్త పురస్సరులైన వీరలై

భీష్మ ద్రోణ కృపాదులు కొందరు దేవాంశ సంభవులైనను దదీయభావంబులు రాక్షసాంశంబు నొందెదు వారు వివిధాస్త్రశస్త్రంబుల బాండవక్షయంబు గావింపగలవారు. పాండవులు బంధు స్నేహంబువిడిచి తెగువకుం జొచ్చి నీచేత నిహతులగుదురు. నీమనంబున అర్జునునివలని భయంబు గొంతగలదు. దాని నెఱింగి యేమును దగునుపాయంబు దలంచితిమి. అది యెట్లనిన కృష్ణుకేశంజచ్చిన నరకాసురు నంశంబు గర్ణు నావేశింపంగలయది తత్కారణంబున నవ్వీరుండు కృష్ణార్జునులతోడ బద్ధవైరుండయి వారిద్దఱ నిగ్రహించు.

నిహితకంటకమైన యుద్ధగణీతలం బఖిలంబు నీ
మహితశాసన గోచరంబగు మానవేంద్ర ప్రసన్నతా
మహిమ నొందుము నీవ తెప్పవు మాకు నందరకుం గురూ
ద్వహ విషాదము వొందబాడియె దైత్యపక్షభయంబుగాన్

అని సంబోధించి ఆలింగనమాచరించి పూజించి సన్మానించినారు. రాక్షస నాయకులందరును వీడ్కొల్పగా కృత్య తిరిగి యతనిని దెచ్చి మొదట తెచ్చినచోట బెట్టినది.

అంతట దుర్యోధనుడు విస్మయపడినాడు. ఇదంతా కలయేమోనని శంకించినాడు. వాస్తవమని నిశ్చయించినాడు. చివరకు తాను కారణ జన్ముడనని విధినియతిచే భీష్మాదులెల్లరును తనకు సహాయులుగా జన్మించి

నారని నరకాసురునంశచే నావేశింపబడి కర్ణుడు కృష్ణార్జునుల సంహారి స్తాడని నిష్కంటకమయిన లోకమునంతయు తాను పాలిస్తానని నిశ్చయించుకొన్నాడు. తనకు గోచరమయిన ఈ అతిమానుష రంగసందర్శనమువలన కౌరవపాండవపక్షములలో నెవ్వరికిని గలుగని యొక అతిమానుషజ్ఞానము గలిగినది. ఇప్పటివరకును స్వబుద్ధిచేతను ఆప్తులబుద్ధిచేతను ప్రేరేపింపబడి వర్తించినాడుగాని ఇంతటినుండియు ప్రతివిషయమును తనకు గలిగిన అతిమానుషజ్ఞానదృష్టితో చూస్తూవచ్చినాడు. ఈ అతిమానుషదృశ్యమునుగూర్చి తనలో యోచించుకొనుచుండగా కర్ణుడు వచ్చి దుర్యోధనుని మనములో నున్నదాని కుపశ్రుతిగా

మది నర్జును జూచి భయం
బొదవినయది నీకు వాని నుగ్రరణమునం
బదునాలవయేడు జయిం
చెద నాయునమాటి ప్రతినసేసితి నధిపా

అని ప్రమాణము సేయగనే దుర్యోధనుని సందేహములన్నియు సమసి పోయినవి. తానుదివ్యబోధమున జూచినవిషయము లప్పుడే ఫలింపప్రారంభించినవనీ తనకుగోచరించిన తక్కినవిషయములును సత్యములేకాగలవనీ నిశ్చయించుకొని ప్రాయోపవేశము విడిచి బయలుదేరినాడు.

తక్కినవారందరికిని తెలియని రహస్యవిషయములు కృష్ణునకు దెలియడములోను దుర్యోధనునికి తెలియడములోను భేదమున్నది. దుర్యోధనుడు అదివరకు తానుకోరిన కోర్కెలు అవలంబించిన మార్గములు వేసినయెత్తులు పన్నిన పన్నుగడలు జయప్రదములు కాగలవా కావా అని చర్చించు కొనుచుండగా ఒకనాడీగ్రంథకారుడు వచ్చి నీకోర్కెలన్నియు నిడివేరగవలనీ నీయెత్తులన్నియు సరియైనవనీ వేయిసంవత్సరముల క్రింద వ్రాసియుంచిన గ్రంథమునుండి చదివి వినిపించినదానికంటెను ఇనుమిక్కిలిగా విషయమంతయు కండ్లతో చూచి చెవులతోవిని ఆచరణలో ప్రత్యక్షమగుటకు ప్రారంభమయినది. తనకు పైవిధముగ అగపడినదానికంతకును ఎవరేమిబోధించినను అతనికి

నచ్చినదిగాదు. అతనిచర్యలో నేదయిన లోపమున్నదని యన్నచో అత డీదృశ్యమును సత్యమని నమ్ముటలో నున్నదిగాని అప్పటిసందర్భము లనుబట్టి నమ్మవచ్చునని యెంచినచో తల్లిదండ్రులయొక్కయు గురుపితామహులయొక్కయు ఋషిసత్తములయొక్కయు నీతిబోధలను త్రోసి పుచ్చుటలో నతనిని మూర్ఖుడనిగాని అజ్ఞానియనిగాని చెప్పవలనుపడదు. కర్ణుడు కృష్ణార్జునులను నిర్జించుతాడనీ లోకరాజ్యము తనహస్తగతమ వునవీ అతడు నిశ్చయించుకున్నాడు. యుద్ధములో భీష్మద్రోణులు పడి పోయినను అతనివిశ్వాసము చలించుటకు కారణము కనపడలేదు. కర్ణుడు పడిపోయినపుడుమాత్ర మతని విశ్వాసము కొంతచలించినది. కాని నిఖిలరాజ్యమునకును నీవధిపతివి కాగలవను భాగమునందుమాత్ర మతడు విశ్వాసము వీడలేదు. ద్వైపాయనహ్రదములో దాగుకొన బోవునప్పుడు సహితము ప్రస్తుతము రణమునకు తొలగియుండి తఱివేచి పగదీర్చుకొందుననియే చెప్పినాడు.

కృష్ణుడు సమస్తము నెరిగియేయున్నాడు. కాని పర్యవసానమే మగునో అర్జునునకును చెప్పలేదు. పురుషకారము తానుచేయుగల దంతయు చేసినాడు. ఇతరులచేత చేయించినాడు. పాండవపక్షమును గెలిపించు టొక్కటియే అతనియుద్దేశమయినచో శిశుపాలుని ఖండించినట్లు తనచక్రముతో దుర్యోధనుని జంపి ధర్మజునకు రాజ్యమిప్పించియుండును. కాని దైవరహస్య మిదిగాదు. భారతకథ మూడుముక్కలలో ముగిసి యుండును : దేవు డొకమామిడిమొక్కను సృష్టించెను. అది నాలుగు కాపులుకాచి గాలివానకు పడిపోవునని నిర్ధారణచేసినాడు. అట్లయినచో ఆనాలుగు కాపులలో కాయదగిన 466 మామిడిపండ్లను ఒకపర్యాయ మాచెట్టుయజమానున కిచ్చి దేవు డూరకొనరాదా ? అట్లూరకొనడు. మొక్క మొలవవలె; యజమానుడు దానిచుట్టూ కుదురుగట్టవలె; నీళ్లు పోయువలె; చెదుపురుగు వచ్చి మొక్కతల గొరికితే యతడు విచారపడవలె; నాలుగుకాపులు కాయవలె. పిందెలు పెరిగి పండవలె. కాపువేసి

పండించి యజమానుడు భుజించవలె. అట్లుకానిచో సృష్టిక్రమమునకు భిన్నముగా నుంటుంది: అస్వాభావికముగా నుంటుంది.

అటులనే కురుపాండవ చరిత్ర పెరగవలె. దుర్యోధనాదులు దుశ్చేష్టలుచేసి పాండవులకు క్రోధము పెంచవలె. ద్రౌపదికి మానభంగముగావించి లోకమునకు విస్తారము గలిగించవలె. ధర్మరాజును జూదరిని జేసి రాజ్యము బోగొట్టించవలె. వనవాస అజ్ఞాతవాసములు జరపవలె. తపస్సులుచేసి అస్త్రశస్త్రములు సంపాదించవలె. కృష్ణుడు మనవైపు ఉన్నాడని వట్టిచేతులతో పాండవులువచ్చి జయముగోరుటకు వీలులేదు. విషాదములో మునిగిన అర్జునుని పురికొలిపి అతనిచేతనే ముసలివాండ్లను చంపించవలె. ప్రతివాడు తనధర్మము తాను చేయువలె. అనగా ఏపాత్రము యొక్క నాటకము ఆపాత్రే ఆడవలె. అందరిపాత్రలభాగములను సూత్రధారుడే ధరించి ఆడిపోడు. కేవలము యుద్ధముమాత్రమే చేస్తే చాలదు. యుద్ధానికి పూర్వము రాయబారాలుకూడా జరగవలె. అల్లాటప్పాగాజరిగితే చాలదు. రాయబారమునకు తగినవాండ్లు వచ్చి తగిన విధముగా జరపవలె. అంతా స్వాభావికముగా కనపడవలె. జగత్తంతా నాటకమని మరచిపోవద్దు. జగన్నాటకసూత్రధారి నాటకమంతా ఆయా పాత్రలచేతనే ఆడిస్తాడు. అవసరమయితే తానుకూడా ఒకపాత్రగానే వస్తాడు. అతిమానుషచర్యల గనపరచి రసభంగంచేయడు. నలుగురిల్లాగ ఆయన ధరించిన పాత్రగూడా ఎగురుతుంది. ఏడుస్తుంది. ముద్దు బెట్టుకొంటుంది. జగన్నాటకమంతా ఒక డాడిస్తున్నాడా లేక దాని యంతట అదే జరిగిపోతున్నదా అని శంకగలిగేటంత స్వాభావికంగా నాటకంప్రదర్శిస్తాడు. కొందరు జనులు భగవంతుడే లేడు. సృష్టి దానంతట అదేస్వాభావికముగా సాగిపోతున్నదనినమ్మి వాదించేటంత స్వాభావికముగాగూడ జగన్నాటకం సాగిస్తున్నాడు.

పైజెప్పిన సూత్రములను కృష్ణరాయబారమునకు వర్తింపజేస్తూ రాయబారక్రమమును విమర్శింతాము. శ్రీకృష్ణభగవానుడు రాయబారమునకు బోయినయెడల తప్పక రాయబారము కుదురునని నకులుడు నమ్మడమూ

గాంధారి యుద్ధానంతరము

ధృతరాష్ట్రపాండు భూపతుల కుమారులు
తమలోన నీసున సమరమునకు
దొడగిన నీ వడ్డపడవయితి తగ జాలు
మానను ల్గలిగియు మాననీయ
వాక్యంపవయ్యును శక్యసమస్తకా
ర్యుండనియును బేర్కొనియు నుపేక్ష
చేసితి

అని గాంధారి శాపమియ్యడమును అజ్ఞాన జనకములే. కృష్ణుడు సర్వశక్తుడు గనుక ఉద్దేశించినయెడల సంధి కుదుర్పగలిగియే యుండునని భావించుట నీవు సర్వశక్తుడవు గనుక దుర్యోధనుని సన్మార్గునిగనే సృష్టింపలేకపోయినావా యని యడిగినట్లు అసమంజసమని చెప్పవచ్చును. అందుననే ఆమె శాపము వ్యర్థమయినది. తచ్ఛాపముచే తన తపశ్శక్తి నంతయును బోగొట్టుకొని గాండీవముబోయిన అర్జునునివలె శక్తివిహీనయయినది. కనుక శ్రీకృష్ణుడు మానవ రాయబారిపాత్రమునెట్లు నిర్వహించినాడని విమర్శించడమే సమంజసము.

సంజయరాయబారముయొక్క ఉద్దేశము దుర్యోధనుడు భాగమిచ్చుటకు అంగీకరింపడుగనుకను భాగమియ్యనిచో ప్రస్తుత పరిస్థితులలో పాండవులు యుద్ధమునకు బూనుకొందురుగనుకను అహింసనుగూర్చి యుపన్యాసము లిచ్చి భాగముసంగతి తేల్చకనే కురుపాండవులు కలిసి యుండునట్లు ధర్మరాజు నొప్పించి యుద్ధము ప్రస్తుతము మాన్పించుటయైయున్నది. కాని భాగ మియ్యనిచో యుద్ధము నిశ్చయమని ధర్మజుడు జవాబుచెప్పినందునను, సంజయు డీవిషయముల నిర్ధారణచేయుట కధికారము లేనివాడయినందువలనను ఇంకొకరాయబార మవసరమయినది.

శ్రీకృష్ణుడు రాయబారమునకు బయలుదేరినాడు. సమర్థుడగు రాజకీయవేత్త. సంభాషణల చతురుడు. ఉభయపక్షములకు గావలసినవాడు. గొప్పపరపతిగలవాడు. మానవకృష్ణుడు రాయబారియైనాడు గాని శ్రీకృష్ణభగవానుడు గాడు. తన యతిమానుషశక్తి నుపయోగించి

దుర్యోధనుని బుద్ధిమరల్చుటకుగాని, కోపించి శిశుపాలునివలె తన చక్రమును ప్రయోగించి దుర్యోధను నొక్కని సంహరించి మహాజనక్షయమును మాన్పుటకుగాని యతడు రాయబారమునకు వెళ్లలేదు. రాయబారమునకై హస్తిపురమునకు వెళ్లకయే ఇష్టమున్నచో తనయింటనుండియే శ్రీకృష్ణుడు పైకార్యముల నిర్వహించేవాడు. కనుక రాయబారములో శ్రీకృష్ణుడు తన అతిమానుషశక్తి నుపయోగించి యుండలేదు. మానవులు సబుద్ధికముగ కర్మలనొనరించి కర్మఫలముల ననుభవించవలెనేగాని వేరు మార్గము లేదు. శ్రీకృష్ణుడు రాయబారమునకు బయలుదేరునపుడు అర్జుననితో

> కావున సంధికిం బురుషకార్య మొనర్చెద నోపినంతయుఁ
> దైవముచేత నెట్లగునొ దాని నెఱుంగ

నని చెప్పినది యెంతయు వాస్తవము. సంధికై తాను చేయగలిగినదంతయు చేసినాడు.

శ్రీకృష్ణునకు మనసున సంధిగావింపవలయునని లేదనియు, దానికై మనసారప్రయత్నింపలేదనియు రాయబారమును మిషతోబోయి యుద్ధమునకై యుభయపక్షములను కదదోసి వచ్చినాడనియు చెప్పడము సత్యవిరుద్ధము. ఇట్టియూహాలకు తిక్కనభారతమున జోటులేదు. దుర్యోధనుని పూర్వచరిత్రమును బట్టి సంధిపొసగదని యెరుగునుగనుకనే

> సుయోధనుండు సం
> భావనసేసి పాలొసగు పాడియగల్గిన బాల్యమాదిగా
> నేవిధినైనను జెఱుప నింతలు పాపము లాచరించునే

యని యర్జుననితో జెప్పి సంధి తాను నిర్వహింప గలనని భ్రమతో నున్న భీమాదులకు ప్రబోధించి పయనమైనాడు.

శ్రీకృష్ణునకు సంధి గావించుటయే ప్రధానాశయముగ నున్నదని రుజువు చేయుటకు మరొక్క దృష్టాంత మున్నది. శ్రీకృష్ణుడు హస్తిపురమునకురాగనే ధృతరాష్ట్రునికి గన్పడి అచ్చటి పరిస్థితుల గనుగొనుటకై వెంటనే విదురునింటికి బోయినాడు. విదురుడు శ్రీకృష్ణునితో

"వ. నీవిటవచ్చుట వినిన యప్పుడు ధార్తరాష్ట్రులందరుం గూడంబారి తమలో నిశ్చయించినతెరంగు నీశాసనం బుల్లంఘింపంగలవారు పాండునందనులకు నేమియు నీకుండు వారు దారయీధాత్రియంతయు బీరువోకుండ నేలువారు దిగ్విజయమునాడు పాండవులచేత భంగపడినవారు చత్తుముగెలుతుము • కాని యొండులేదని నిశ్చయించుకొని యున్నారు. సంధిగానేరదు..............పాండవేయులపై స్నేహంబునను నీమీదిభక్తినిం జెప్పెద నందు బోవలదు"

అని స్పష్టముగా జెప్పినాడు. అందుకు శ్రీకృష్ణుడు జెప్పిన జవాబువలన అతని హృదయాంతర్గతమయిన శాంతిస్వరూపము బయలు పడగలదు. జవాబును సంక్షేపరూపమున ఇచ్చుట వ్రాయదలచితిని. కాని తిక్కన వ్రాసిన దానిని క్లుప్తపరచుట దుస్సాధ్యముగనుక నాపద్యములనేయిందు బొందుపరచుచున్నాను.

ఎరుగుదు నేను సుయోధను
కొరగామియు నతనితోడ గూడిన నృపులుం
దరుచుగ మనమున నిడికొని
యలుముటయును సంధిపొసగదనియు మహాత్మా
పుడమియెల్లనొడ్డ గెడవయి
యంతముగాగడంగి యుగ్రమృత్యు
ముఖముసొరగ దివురు మూర్ఖతమాన్చుట
యధికమైనపుణ్య మనఘ యంత
మానుపనచ్చునే యంటిపేని
దొరకొని పుణ్యముబాపము
నరు డర్థింజేయుచుండ నడుమ నొకంటన్
వెనవెనలి తప్పినను ద
త్పరిణతిఫల మొందునండ్రు ధర్మవిధిజ్ఞుల్
అట్లుగాక
చుట్టములలోన నొప్పమిపుట్టినప్పు
డడ్డపడి వారితోడ బోరాడియైన
బూని యుడుపంగ జొరకున్న వానిగ్రూర
కర్ముడని చెప్పుదురు కర్మకాండవిదులు.

కావున నీరెండు తెరంగులవారికి శాంతిగావింపం బ్రయత్నంబుచేసెద............ఇట్లు చొచ్చి చెప్పుకున్న నన్నదమ్ములు దమలోనంబోర గృష్ణుండు వారింపక యుపేక్షించె. దన చేతంజక్కంబడదాయని యజ్ఞులై జనులాడుదురు.

౮౮౬

ఈయుత్తరమునకు విదురుడు నిరుత్తరుడై యట్లుకాకయని నమ్మ తించినాడుగాని కృష్ణుడంత జేసినను ఆయన యనుమానించినట్లు "కృష్ణుంకు వారింపక యుపేక్షించె. తనచేతం జక్కంబడదాయని" ఆర్యులు నహిత మాడుచుండడ మాశ్చర్యము గదా.

నూటతొంబదితొమ్మిదిపాళ్లు కౌరవులు సంధికొడంబడరని నిశ్చ యమే యయినను పొరబాటుననైనను దుర్యోధనుడు సంధి కొడంబడు నేమోయని కృష్ణునియాస.

శ్రీకృష్ణు డట్టిసందేహములతోను అడియాసలతోను సంధికి బయలుదేరినాడు. దుర్యోధనాదులు దుర్వ్యవసాయములకు దిగుదు రేమోయని తన రథముపై చక్రము గద మున్నగు ఆయుధంబుల బెట్టిం చుకొని సాత్యకిని తోడుదీసికొని యుదయమున బయలుదేరి సాయం సమయమగునప్పటికి కుశస్థలము జేరి యూరిబయట జనసమ్మర్దము లేని తావున డేరాలువేయించి ఊరివారిచే సన్మానింపబడుచుండగా నీప్రయా ణము కౌరవులకు తెలియవచ్చినది.

సంధి సాధ్యముగాకపోయినను ఈరాయబారమంపుట పాండవుల కవసరమే. ద్రుపదపురోహితుని రాయబారమువలన కౌరవుల యాంత రంగిక వృత్తులు పూర్ణముగ దెలియలేదు. విదురుని సలహాను పొంద లేదు. సంధి కుదరకపోతే యుద్ధానికి కౌరవుల అన్యాయవర్తనమే కార ణమన్ని లోకమున నమ్మేటట్లు చేయవలె. కౌరవపక్షముననున్న న్యాయ మార్గులకందరికి దుర్యోధనునిమీద అసహ్యము బుట్టించవలె. యుద్ధ మంటే వారి కుత్సాహంలేకుండా చెయ్యవలె. ధర్మాన్ని ప్రతిఘటి స్తున్నామని వారికి దోచవలె. వారిలో అంతఃకలహాలు పుట్టించవలె. లేకపోతే భీష్మ ద్రోణ కర్ణాశ్వత్థామ శల్యులు ఏకమనస్సుతో ఒక్కు మ్మడిగా యుద్ధంచేస్తే జయించడం దుర్ఘటం. ఈపనంతా తగుమనిషి రాయబారిగాబోయి చెయ్యవలె. నెయ్యానికైనా కయ్యానికైనా చాలినవాడు శ్రీకృష్ణుడు. అతడు తన ధర్మము నెట్లు నిర్వహించినాడో చూడవలసియున్నది.

గుంటూరు. పున్నవ లక్ష్మీనారాయణ.

# పల్లవులెవ్వరు?

శ్రీ యన్. వెంకటరమణయ్యగారు, ఎమ్. ఏ., పి. హెచ్. డి.

సుప్రసిద్ధ చరిత్రకారుఁడగు విన్సెంటు. ఎ. స్మిత్తుగారు తమ ప్రాచీన హిందుదేశ చరిత్రయందు పల్లవులనుగూర్చి యిట్లు ప్రశ్నించు చున్నారు "పల్లవులెవ్వరు? వారెచటినుండి వచ్చిరి? దక్షిణదేశపు రాజ్యములలో వారగ్రస్థానము నెట్లార్జించిరి?" మఱియు తమ ఆక్స ఫోర్డ్ హిందూదేశచరిత్రమున వారే, "హిందూదేశ చరిత్రమునందు పల్లవుల (చరిత్రము) పరమ రహస్యముగనున్నది" అని నుడివియున్నారు.

వాస్తవము విచారింపఁగా పల్లవులచరిత్ర మతి గూఢతమమగు నొక మహాసమస్యగ నన్పట్టుచున్నది. ఈసమస్యను పలువురు పలువిధ ములఁ బూరించియున్నారు. ఆంగ్లభాషనెఱుఁగని పరిశోధకుల కెఱుక పఱచుటకై శాస్త్రజ్ఞులగు పండితు లీవిషయమునుగూర్చి బయలు పుచ్చిన యభిప్రాయములను వర్ణించి, తదనంతరము నాయభిప్రాయ మును దెల్పుచున్నాను.

(౧) పల్లవులాద్యమున భారతీయులు గారనియు, వారు పారశీక మునుండి వచ్చిన పార్థవులలో నొక తెగవారనియు, కొందఱుపండితు లభిప్రాయపడియున్నారు. రైసుగారిట్లు తమ యభిప్రాయమును వెల్ల డించియున్నారు. "తాము భరద్వాజ గోత్రజులమని కొన్ని శాసనముల యందు చెప్పుకొనియున్నను పల్లవులయుత్పత్తి యిట్టిదని నిశ్చయించి చెప్పుటకు వీలులేకయున్నది. హైహయ, శక, యవనాదులను వర్ణించు సందర్భమున, పురాణములు వీరిని పహ్లవు లనుపేర బేర్కొనుచున్నవి. వీనివలన వీరి యుత్పత్తిస్థలము పారశీకమని తోఁచుచున్నది." అయినను ప్రొఫెసరు వీబ రిట్లు జెప్పుచున్నాఁడు.

"ఈ 'పహ్లవ' యనుమాట పారశీకమున చిరకాలమునకుముందే, జాతిసంబంధముగ వాడబడినపుడు అన్యదేశజుల నామముగా నెన్నబడెను. పహ్లవభాషాగ్రంథములలో నది

(జాత్యర్థమునఁ బ్రయోగింపఁబడిన పహ్లవశబ్దము) కాన్పించదు. కాన, పహ్లవులు హిందూదేశమునకుఁబోయినకాలము రమారమి క్రీ. శ. ౨, ౩ శతాబ్దముల మధ్యకాలమున నని స్థిరపఱచవలసియున్నది. పహ్లవశబ్దముచే పారశీకదేశజులని మనమనుకొనఁగూడదు. వారు పారశీకులను పేర బరగుచున్నారు. అందువల్ల అర్సాకిడుజాతికి సంబంధించిన పార్థవులని గ్రహించవలయును. పల్లవశబ్ద మొకవేళ పార్థవశబ్దభవమై యుండవచ్చును.''

*Mysore Gazetteer.*

ఇంచుమించుగా నిట్టి యభిప్రాయమునే ఫ్లీటుగారును, వెంకయ్యగారును ప్రచురపఱచి యున్నారు. వీరి యభిప్రాయములను దుబ్రేగారు హేళనఁజేయుచు యీక్రిందిరీతిని వ్రాసియున్నారు.

ఈ యభిప్రాయమును బలపఱచువారు, పల్లవులు పార్థవజాతికి సంబంధించిన యౌత్తరాహులనియు, పారశీకమునుంచి వచ్చి యుత్తరాపథమున నెచ్చటను నిలువఁజాలక పోవుటచే కాంచీపురమువఱకును దమదాడిని సాగించిన దేశద్రిమ్మరుల గుంపనియు విశ్వసించుచున్నారు. ఇది మనస్సును రంజింపఁజేయు నూహ. పార్థవులనబడు తెల్ల మనుజులు, ధనుర్ధరులై (పార్థవబాణము సుప్రసిద్ధము) దేశాటనముసేయు గుంపుగఁ గూడి, తమ శిబిరముల నొకదేశమునుండి యింకొకదానికి లేవనెసికొనిపోవుచు, మార్గమున గనుపడు వస్తువులనన్నిటిని హూణులవలె నాశనము జేయుచుండిరని వీరు తమ మనశ్చక్షువుముం దొకచిత్రమున జిత్రించుకొనియున్నారు. ఈరీతిని వారు హిందూస్థానమునందంతటను గ్రుమ్మరి, కడపట నీ ద్వీపకల్పపు దుపెభాగమున నిలిచియుందురు. తదనంతరము, దక్షిణదేశములోనున్న ప్రాచీనులగు జాతులవారి నోడించి, తమ రాజధానిని కాంచీపురమునందు స్థిరపఱచుకొనియుందురు. ఈ పైయభిప్రాయమున కొక గొప్పయాక్షేపణయున్నది. పార్థవులలో నొక్కతెగవారందరిచేతను సేయబడి పారశీకపు సరిహద్దు మొదలు దక్షిణహిందూద్వీపకల్పమువఱకు వ్యాప్తమైన యీ పెనుదండయాత్ర దక్కనురాజ్యస్థితులలో మహాకల్లోలమును గలుగఁజేసి యుండవలయును. ఇట్టి ముఖ్యవిషయ మెప్పుడు జరిగియుండును? కొందఱు గ్రంథకర్తలు, ముఖ్యముగ వెంకయ్య, 'పల్లవులు దక్షిణదేశమునకు వచ్చినకాలమును నిర్ధారణసేయుటకు బ్రయత్నముజేసిరి. అయినప్పటికిని, నేటివఱకును పార్థవులు దక్షిణదేశముపైఁజేసిన దండయాత్రకునిదర్శనముగ జూపగల దాఖలాయేదియు గన్పించలేదు. ఈయభిప్రాయము గూఢమగు పల్లవసమస్యను మఱింత గూఢముగ సేయుచున్నది.''

—ద. పూ. చ. పుటలు 46-47.

పై కారణములచే నీయభిప్రాయము సరియైనదికాదని త్యజింపఁబడినది. పల్లవులు అన్యదేశమునుండి రాకున్న, వారిపుట్టుక యెట్టిది? వా రెచ్చటివారు? వారాద్యమున నుండియు భారతీయులేనా? అట్లయిన వారికిని తక్కిన భారతీయ జాతులకును ఉన్న సంబంధ మెట్టిది? ఈప్రశ్న

లను సరియగు సమాధానము జెప్పవలసియున్నది. ఈసందర్భమున పేరును యశమును గడించిన పండితుల వాదములను గమనించవలసి యున్నది. వీరు పల్లవు లఱవ వారేయని యొప్పుకొన్నను, ముఖ్యవిషయ ములయందు అభిప్రాయ భేదముల గనుపఱచియున్నారు. అందువల్ల వీరి యభిప్రాయముల నెఱుగుట యావశ్యకము. వీరిలో ముఖ్యుఁడు విన్సెంటు ఏ. స్మిత్తు. ఆక్సుఫర్డు హిందూదేశ చరిత్రమునం దాయన దన భావములను వెల్లడించియున్నాఁడు.

చ. ౧ "కరికాలచోళునియొక్కయు సింహళరాజగు గజబాహువుయొక్కయు కాలమునకు దరువాత, చరిత్రరంగస్థలమునఁ బ్రథమమున నగపడుశక్తి పల్లవులది. నాలవశతాబ్దపు మధ్య సముద్రగుప్తుఁడు, కంచి లేక కాంచీపురనాథుఁడగు పల్లవరాజు నొక్కని నెదుర్కొనెను. ఆంధ్రులు గతించిన పిమ్మట, మూడవశతాబ్దమున వారివంశ ముద్భవించి యుండవచ్చుననుట యసంభవముగాదు.

"పల్లవులు హిందూదేశపు చరిత్రలోని గూఢరహస్యములయం దొక్కదాని కాస్పదులై యున్నారు. వారు పహ్లవులు అనగా పశ్చిమోత్తరదిశనుండి వచ్చిన పార్థవులు లేక పారశీకులను నూహ మాటలపైపోలికలవల్ల స్ఫురించినదగుటచే దానిని పాదులేని యూహ యని సత్వరముగ త్యజింపవచ్చును. వారినిగూర్చి తెలిసిన విషయములన్నియు, వారు ప్రాచీనతమిళగాథలలో ప్రాముఖ్యతవహించనట్టియు, ఆద్యమున పాశుపాల్యమే ముఖ్య వృత్తిగా గల్గినట్టియు కురుంబలలో తత్సాంబంధికులగు ద్వీపకల్పనివాసులగు నొక జాతి వారో యని సూచించుచున్నవి. కొన్నిసమయములయందు పల్లవులు "అటవికులు"గ నెన్నబడి యున్నారు. సాహసాజేయ క్షాత్రగుణములచే నిటీవలగూడ ప్రఖ్యాతినొంది, అపరిహార్యులగు స్తేనస్తోమములలోనివారుగ బరిగణింపఁబడిన కళ్లర్లతో రక్తైక్యతగలవారుగ నగపడుచున్నారు. తిరుచినాపల్లి, తంజావూరు, మధుర జిల్లాలమధ్యనున్న పుదుకోట సంస్థానాధిపుఁడు కళ్లఁడు. అతఁడు పల్లవరాజులవంశమున బుట్టితినని చెప్పుకొనుచున్నాఁడు. తన పూర్వీకుల మార్గములను త్యజించి యాతఁడు తిరుచినాపల్లి కలెక్టరుగారి సలహా ప్రకారము ప్రభుత్వముసేయు నిప్పటిరాజుల తరగతిలో జేరియున్నాఁడు."

ఈ పుటయొక్క అధోజ్ఞాపికయం దిట్లు వ్రాసియున్నాఁడు.

"సంపూర్ణస్థానిక (local) జ్ఞానముతో వ్రాయు శ్రీనివాస అయ్యంగారి మతాను సారము పల్లవులు ఆస్ట్రేలేషియా వాస్తవ్యులను నీగ్రిటోలతోడను, తదనంతరమున వచ్చిన మఱియొక సంకీర్ణజాతితోడను గలసిన నాగజాతికి సంబంధించినవారు. వారి పురాతన నివాసస్థలము తొండమండలము (మదరాసు చుట్టునున్న జిల్లాలసమూహము). తంజావూరు, తిరుచినాపల్లెలు తరువాత సంకలితము సేయఁబడినవి. క్షత్రగుణసంపన్నమగు పల్లె

లేక కురుంబజాతివారినుండి పల్లవసైన్యము గూర్చబడెడిది. మువ్వరు తమిళరాజులకును పల్లవరాజులకును వంశపారంపర్యమగు శత్రుత్వముండెను. దక్షిణదేశమున పల్లవులు దేశములోనికిఁ జొచ్చుకొనివచ్చిన యన్యులుగఁ బరిగణింపఁబడిరి. కావున తమిళభాషలో పల్లవ శబ్దమునకు దొంగయను నర్థము గలిగినది. చోళపాండ్యదేశములయందు నివాసస్థానము లేర్పఱచుకొన్న పల్లవులు కళ్లరులు అనఁగా దొంగలని పేర్కొనఁబడిరి. వీరందఱును నాగ జాతికి సంబంధించిన వారని చెప్పుటకే సందేహమునులేదు."

"ఆవాక్యములు గ్రంథములోని (text) యభిప్రాయమును బలపఱచుచున్నవి. ఇవి (అభిప్రాయములు) కొన్ని సంవత్సరములకు ముందేర్పడినవి."

పల్లవులు పశ్చిమోత్తర దిగ్భాగమునుండి హిందూస్థానమును జొచ్చి దక్షిణమునకు వచ్చి కాంచీపుర ప్రాంతములయందు శాశ్వత నివాసస్థలముల నిర్మించుకొన్న పారశీకు లనుమతమును స్మిత్తుగారు నిర సించినది బాగుగనే యున్నది. కాని, వారుకళ్లరులని, కురుంబులని వ్రాసినవ్రాతకేమియు నాధారము గానరాదు. కళ్లజాత్యుద్భవుఁడగు పుదుకోట సంస్థానాధిపతి తాను పల్లవవంశజుఁడనని చెప్పుకొనుటయే దీనికి వారుచూపిన ప్రమాణము. వాస్తవముగ పుదుకోటరాజు కళ్ల జాత్యుద్భవుఁడా? అవుననుకొన్నను అతఁడు తాను పల్లవుఁడనని చెప్పు కొనుటచే పల్లవులును కళ్లరులును ఒకజాతి వారను సిద్ధాంతము సరియై నదా? గొల్లవాండ్రందఱును తాము యాదవుల మనుచున్నారు. చతుర్థ కులజులగు విజయనగరరాజులును దమవంశమును యదువున కంటగట్టిరి. ఇంతమాత్రముచే వీరందఱును క్షత్రియులగు యాదవులగుదురా? లేక యాదవులును గొల్లవాండ్రును నొక్కరేనని సిద్ధాంతము సేయుట పాడియా? కావున, పుదుకోటరాజు తానుపల్లవవంశజుఁడనని చెప్పు మాటయేకారణముగా జూపుచు పల్లవులును కళ్లరులు నొక్కరేయని సిద్ధాంతీకరించువాదము నిలువజాలదు. ఇక శ్రీనివాసయ్యంగారి వాక్య ములు స్మిత్తుగారి సిద్ధాంతము నెంతవఱకు బలపఱచునో చూతము. మువ్వురు తమిళరాజులకును బల్లవరాజులకును వంశపారంపర్యముగు వైర ముండుట; పల్లవశబ్దమునకు దమిళదేశమున దొంగయను నర్థముగల్పిం చుట; వీనినిబట్టిచూడ స్మిత్ శ్రీనివాసయ్యంగార్లను కొనురీతిని పల్లవులు

దమిళులుగారను నూహపొడముచున్నది. వీరన్యదేశమునుండి ద్రావిడ మందుప్రవేశించిన వారగుటచేతనే తమిళరాజులకును వీరికిని శాశ్వత వైరముగల్గుటకు గారణము. తత్కారణముననే పల్లవశబ్దమునకు చోరులను నర్థమును అఱవవారు గల్పించుకొనిరి.

(౮) సింహళమునకును హిందూదేశమునకును మధ్యనున్న జాఫ్నా ద్వీపకల్ప వాస్తవ్యులగు మొదలియారు రసనాయగముగారు పల్లవుల జన్మస్థానము జాఫ్నాయని యొకక్రొత్త వాదమును బయటవెట్టిరి. వీరి వాదమున కాధారము 'మణిమేకలై' యను నఱవకావ్యము. ఈగ్రంథమున కిరికాలుని మరణానంతరము, అతనిపుత్రుఁడు కిల్లియనువాఁడు, ఉరయూరునందు రాజ్యము చేసినట్లు వర్ణింపఁబడినది. అతనితమ్ముఁడ ఇళంకిల్లి లేక ఇళంకోయనువాఁడు కంచియందుండెను. అతని పిమ్మట కిల్లికినాగకన్యవల్ల బుట్టిన తొండమాన్ ఇళంతిరయన్ అనువాఁడు కంచి రాజ్యమున కభిషిక్తుఁడాయెను. తొండమాన్ ఇళంతిరియనను నతఁడు కిల్లికిని, మణి పల్లవపు నాగరాజు, వళైవానుని కుమార్తెయగు పీలివళకును బుట్టినకుమారుఁడు. మణిపల్లవమునుంచి పూహారునకు వచ్చు మార్గమున నావపగులుటచేత నాతఁడుసముద్రమున గొట్టుకొనిపోయెను. గాని యాతఁడు దొండైతీవలయందు దగుల్కొని యొడ్డునకు గొట్టుకొని వచ్చెను ; తత్కారణమున నాతనికి తొండమాన్ ఇళంతిరయననియు, తొండైమానననియు, సముద్రమునుండి తీరమునకు గొట్టుకొనివచ్చుటచే తిరయన్ అనియు పేర్లు వచ్చినవి. తొండమండలము చోళమండలము నుండి వేర్పరుపఁబడి ఇళంతిరయను కాతనితండ్రిచే నొసఁగఁబడెను. అతనికి కంచి రాజధాని. తొండమండలమును స్వతంత్రముగ నేలినరాజులలో యాతఁడే ప్రథముఁడు. వానివంశమునకే పల్లవ వంశమనిపేరు.

ఇళంతరయుని నాగమాత యాతనితండ్రికంటె హీనకులజురాలగుటచే నాతనివంశము పితృవంశముపేరగాక మాతృజన్మభూమియగు మణిపల్లవముపేరబిలువబడెను. మణిపల్లవమే జాఫ్నాయని సిద్ధాంతీకరింపఁబడినది. అప్పుడది యొకద్వీపముగనుండెను. హిందుదేశమునుండి

పోవువారలకది లంకాద్వీపపు శాఖవలె గాన్పించియుండును. కావునదానికి పల్లవమని పేరువచ్చెను. పల్లవశబ్దమున కఱవములో రెమ్మయనియర్థము. మణిపల్లవమను మాట మణిమేకలయందు మాత్రము గాన్పించుచున్నది. ఇంతకు పూర్వమున్న పేరు మణిపురము. నాగులకునికి పట్టినాగరాజుల యేలుబడి యందుండుటచే దానిని సింహళ ద్వీపవాస్తవ్యులు మణినాగ ద్వీపమందురు. తమకు రెమ్మవలె గాన్పించుటచే, పల్లవము'ను పేరు 'మణి' యను నుపసర్గకు నఱవవారిచే సంకలితము సేయుబడినది. కడపటి పల్లవ రాజులు బుధ్యాంకుర, నయాంకుర, తరణాంకుర, లలితాంకురయని సంస్కృతమున రెమ్మయను నర్థముగల 'అంకుర' శబ్దాంతములగు బిరుదులను ధరించిరి. 'రెమ్మ' యని పల్లవ శబ్దమునకు సమానార్థముగల 'పోతు' అనునఱవమాటను నొకబిరుదుగాధరించిరి. ఇందువల్ల వారుతమ వంశోత్పత్తిస్థానమును జ్ఞప్తియందుంచుకొని, ఆయర్థమునిచ్చు బిరుదులను ధరించిరని తెలియవచ్చుచున్నది. పల్లవరాజుల చేధరింపఁబడిన 'పోతరాయర'ను బిరుదు పల్లవశబ్ద సమానార్థకమును, రెమ్మ యనునర్థముగల 'పోతు' అను నఱవ మాటనుండి పుట్టినదే."

Indian Antiquary XLVI.

ఈవాదము వింతమైనది. స్మిత్తుగారు పల్లవు లఱవదేశవాస్తవ్యులుగ నుందురన, రసనాయగముగారు వారిని జాఫ్నా ద్వీపకల్పములోని తమ గృహపురోభాగమునకే లాగిరి. మణిపల్లవ ద్వీపమున కాపేరు వచ్చిన విధమును వివరించు సందర్భమున సింహళమునకు (హిందూదేశమునుండి)బోవు తమిళుల కది లంకాద్వీపపు రెమ్మవలె గన్పించుటచే, మణియను నుపసర్గకు రెమ్మయని స్వాభావయందర్థముగల పల్లవశబ్దము నతికించుటచే మణిపల్లవనామ మేర్పడెనని చెప్పిరి. వృక్షమున కంటుకొనిగదా రెమ్మయుండ వలయును? ఇప్పటివలె పూర్వకాలమునగూడ జాఫ్నా ద్వీపకల్పమైయుండిన రసనాయగముగారి వాదమున కనుకూలముగ నుండియుండును. "ఆకాలమున అది యొకద్వీపము" అని వారే యొప్పుకొనియున్నారు. కావున సింహళదేశమునకు బోవువారి కది

రెమ్మవలె గాన్పించుటయు, తత్కారణమున నఱవలు దానికి స్వభాష యందు రెమ్మయను నర్థముగల పల్లవమను పేరిడుటయు నసంభవములు. ఇంకొకమాట. పల్లవ, పోతశబ్దములు రెండును సంస్కృతములే. రసనాయగముగా రనుకొన్నట్టు అఱవమాటలుగావు. కావున అఱవ లీమాటలను వాడిరనుట సమంజసముగాదు. మణిమేకల యందలి కథకును పల్లవోత్పత్తి ప్రకారమునకును నేసంబంధమునులేదని నాతలఁపు. ఈసందర్భమున రెండుప్రశ్నల నడగవలసియున్నది (౧) తొండమాన్ ఇళందిరియన్ కిల్లికుమారుఁడు గదా. తద్వంశజులగు పల్లవులకెవ్వరికిని అఱవ పేర్లు లేకపోవుటెట్లు? చూడుఁడు: నిడుముడి కిల్లి, కిల్లి, కొచెంగన్, ఇళంకిల్లి, ఇత్యాది చోళనామములును; నిడుమారన్, నిదున్జెలియన్, ఇత్యాది పాండ్యనామములును; సెంగన్ చేరన్, చెంకుట్టువాన్ ఇత్యాది చేరనామములును పల్లవవంశమును గాలించి చూచినను కల్కొమునకైన గాన్పింపవు. పల్లవు లఱవులైన యిదియెట్లు సంభవించును? (౨) తొండమండలము ఆంధ్రరాజ్యమున జేరియుండెనుగదా? ఆంధ్రరాజ్యాంతమున సామంతులగు నాగరాజులేగదా తొండమండలమున స్వతంత్రులైనది? నాగకన్యకా సంబంధముచేతగదా పల్లవుల కీరాజ్యమువచ్చినది? అట్లైన కిల్లియను చోళరాజునకది స్వాధీనమై యుండుటెట్లు? దానిపై నాతఁడు ప్రథమమున నిజసోదరుని ప్రతినిధిగ నేయుటెట్లు? తదనంతరము నాగకన్యవల్ల దనకుద్భవించిన తొండమాన్ ఇళంతిరయన్‌ను రాజును సేయుటెట్లు? చోళు లీదేశము నెప్పు డెవ్వరికడనుండి గెల్చి సంపాదించిరి? ఈప్రశ్నల కన్నిటికిని తృప్తికరములగు సమాధానము లియ్యక పల్లవులఱవలనువాదమును నిలుపుటకు సాధ్యమగునా? నాకుజూడపల్లవులఱవలుకారను వారివాదమే సమంజసముగనున్నది. ఇట్టివాదమును ప్రథమమున ప్రతిపాదించినవారు చిలుకూరి వీరభద్రరావుగారు. తొండమండలమునకు వీరిచేగల్పింపఁబడిన వ్యుత్పత్తి, రసనాయగముగారి వ్యుత్పత్తికంటె సమంజసముగనున్నది. రసనాయగముగారి మతానుసారము, తొండైయను లతలయందదగులొకని, చోళరాజగు కిల్లికిని,

నాగకన్యకను బుట్టిన కుమారుఁడు, కడలిదరికి గొట్టుకొనివచ్చుటచే నాతనికి తొండమానను పేరువచ్చెను. తొండమాన్ రాజ్యము నేలినవిపయు మగుటచే నాతఁడేలిన రాజ్యమునకు తొండమండలమను నామము గల్గెను. తొండమండల నామమున కర్థము సెప్పుటకిట్లు కట్టుకథయొకటి యటువవారు గల్పించుకొనవలసి వచ్చినది. వీరభద్రరావుగారిట్లను చున్నారు. "తొండై మండల మనునది దండకనాడు యొక్క రూపాంతర ముగఁ గన్పట్టుచున్నది. దండకనాడనునది, దండకారణ్యమను సంస్కృత పదము నుండి యేర్పడినదిగఁ గన్పట్టుచున్నది" ఆం. క.సం., పూ. యు. పుట ౨౦౩).

పల్లవోత్పత్తినిగూర్చి వీరిట్లువ్రాయుచున్నారు.

"వీరలు కృష్ణా గోదావరులకు నడుమ వేఁగిదేశమునఁగాని, మఱి యొకభాగమునఁగాని యాంధ్రదేశమున నేర్పడిన యొక తెగయనుట వాస్తవము. రెండవశతాబ్దమున పల్లవ రాజు లాంధ్రదేశమును బాలించుచుండిరని వారిశాసనములు వేనోళ్ల ఘోషించుచున్నవి. ఈవిషయమును జరిత్రకారులందఱును నంగీకరించియున్నారు. ఈతెగ యెట్లేర్పడినదను విషయములో మాత్రము చరిత్రకారులు భిన్నాభిప్రాయులై యున్నారు. పల్లవులు దారిదోపిడికాండ్ర తెగయనుట కంటెను, పహ్లవులు పల్లవులయిరని యూహించుటకే హేతువు లెక్కువగఁ గానవచ్చుచున్నవి............"

• "ఈకాలముననే పహ్లవులకో శకనులకో సంబంధించిన క్షాత్రపులు సురాష్ట్ర, మాళవదేశములను వశము చేసుకొని పాలించుచుండిరని మన మిదివఱకే తెలిసికొనియుంటిమి. ఈ కాలముననే యాంధ్రదేశమునుజొచ్చి యవనశకపహ్లవాదులు కల్లోలమును బుట్టించిరనియు, ఆంధ్రులస్వాధీనమందుండిన మహారాష్ట్రదేశము సురాష్ట్రక్షాత్రపులచే జయింపఁబడి యాక్రమింపఁబడినదనికూడఁ దెలిసికొనియుంటిమి. రెండవ శతాబ్దప్రారంభమునందనఁగా ౧౩౦-దవ సంవత్సర ప్రాంతమున గోతమిపుత్ర శాతకర్ణుఁడను నాంధ్రరాజు యవనశకపహ్లవాదుల నోడించి సురాష్ట్రక్షాత్రపుఁడగు క్షహరాటనహపానువంశమును నిర్మూలముజేసి తన పూర్వులు కోల్పోయినరాజ్యమును మరల సంపాదించుటయె గాక క్షాత్రవభూములనుగూడ నాక్రమించెననికూడ దెలిసికొనియుంటిమి. అంతకుఁబూర్వ మాంధ్రదేశమునకువచ్చి.. ......విశేషముగా మార్పుఁజెందియుండిన యవనశకపహ్లవాదులు దేశమున స్థిరనివాసము లేర్పఱచుకొని దేశాచార మతాచారము లవలంబించి దేశీయులతో సంబంధ బాంధవ్యముల నెఱపుచుఁ గ్రమముగా దేశీయులలోగలసిపోయి పల్లవులను తెగగా నేర్పడిరనియు, వీరు మొదటనివసించిన ప్రదేశము పల్లవనాడైనదనియు, అదియె యిప్పుడు

పల్లాడను పేరఁబిలువఁబడుచున్నదనియును గూడ దెలిసికొనియుంటిమి........కాబట్టి వీనినన్నిటిని పరిశీలించి చూచినపుడు పహ్లవులు దేశాచార మతాచారముల నవలంబించి దేశీయనామములనే ధరించి పల్లవులై యాంధ్రులకు క్షాత్రపులకు నూడిగములు సల్పుచుండి క్రమముగా సేనాధ్యక్షులుగను,మంత్రులుగను నేర్పడి రాజకుటుంబములతో సంబంధ బాంధవ్యములను నెఱపుచు ప్రధానరాజకుటుంబము బలహీనమై రాజ్యభారమును నిర్వహింపఁజాలని కాలమున స్వతంత్రులై స్వతంత్రరాజ్యముల నెలకొల్పిరని యూహింపఁదగి యున్నది. స్వదేశమును స్వమతమును మఱచిపోయి హిందూమతమునుబూని హిందూ నామములను బెట్టుకొని వ్యవహరించుచు బహుకాలము వెనుక నాంధ్రదేశమునకువచ్చి, వర్ణాశ్రమధర్మము లంతగాఁ బాటింపఁబడనికాలమున నొకశతాబ్దమువఱకు నాంధ్రుల నడుమ నివసించుచుండి సంబంధబాంధవ్యములు నెఱపుచుండిన వారాంధ్రులుగాఁ గాక మఱి యెవ్వరుగా బరిగణింపఁబడవలసినది? "ఆంధ్రులనక తప్పదు. ద్రావిడదేశమునందలి కాంచీపురమును జయించి పరిపాలించినది యాంధ్రపల్లవులుగాని పహ్లవులుగారు. కాంచీపురమందు కట్టకడపట స్థిరముగా నిలచిపోయినది యాంధ్రపల్లవులలో నొకశాఖవారు మాత్రమే గాని కొందఱు తలంచునట్లు పల్లవులందఱు కారు." ఆం. క. సం., పూ. యు. పుటలు ౨౦౭—౨౦౯.

ఇట్టి యభిప్రాయమునే దుబ్రేగారును వ్యక్తపఱచియున్నారు.

(౧) "ఆంధ్రసామ్రాజ్యము మహారథులను బిరుదులుగల సామంతులచే నేలబడుచుండెను. సర్పములను పూజించు జాతివారలగుటచే వీరు నాగులను పేరఁ బిలువబడిరి.

(౨) రెండు తెరచాపలుగల యోడయొక్క ప్రతిమను ముద్రించిన నాణెములు మదరాసు కడలూరులమధ్యతీర ప్రాంతములయందు మాత్రమే దొరకినవి. ఇవి కంచిరాజధానిగాగల తొండమండలపు నాణెములు. వీనిపై "శ్రీపులుమాయి" యనుమాటలు ముద్రింపఁబడియున్నవని ప్రొ. రాప్సన్‌గారు చెప్పుచున్నారు. ఉజ్జయినీసంజ్ఞ సాతవాహన వంశమును సూచించుచున్నది. కావున నీవంశస్థులు కాంచీపురమునందు రాజ్యముజేసిరి. ఇదియును, శాతవాహన వంశపు కడపటిరాజగు పులుమావిశాసనమువల్ల స్కందనాగుఁడను సామంతరాజాతనికి మహాసేనానియై యుండెనని తెలిసికొనుచున్నాము. కావున శాతవాహనుల యంత్యకాలమున నాగులు ఉచ్చస్థితియందుండిరనుటకే సందేహమునులేదు.

(౩) నాగకులులగు 'చుటు' వంశస్థులు శాతవాహనుల తదనంతరము ప్రభుత్వముజేసి రాజకుటుంబములలో నొక్కదానికి సంబంధించినవారు.

(౪) నాగజాతివారగు చుటువంశస్థులు ప్రాచీనులగు పల్లవరాజుల సమకాలీనులగుట నిజము.

(౫) నాగకులులగు చుటురాజుల పిమ్మట పల్లవులు రాజ్యమును పాలించిరనుట నిక్కము.

(౬) వేలూర్పాళియమందు దొరకిన పల్లవ తామ్రశాసనమున వంశపారంపర్యముగ పల్లవకుటుంబమున బ్రతీతియందున్న వంశచరిత్రము (శ్లో. ౩ మొదలు ౨౨ వఱకు) వర్ణింపఁబడియున్నది. అచ్చట, పల్లవవంశమున రాజ్యమేలినవారిలో బ్రథముఁడు తద్రాజ్య చిహ్నములనన్నిటిని సర్వరాజుయొక్క కుమార్తెను (నాగవంశజుఁడగు రాజుకూతురనుట స్పష్టము) వివాహమాడుటచేత పొందినట్లు చెప్పబడియున్నది (శాస. శో. శా. ని. వ ౧౯౨౦——౨౧ జి. ఓ. పబ్లిక్ జూలై ౨౯, భా. ౨ పుట ౬౧).

(౭) నాచే విరచితమగు "పల్లవులు" (పాండిచ్చేరి ౧౯౧౭) అను గ్రంథమున విస్తరింపఁబడిన వాదమునే యిచ్చటను అనుసరించుచున్నాను. "మిక్కిలియు ప్రాచీనులగు పల్లవులు రాజులుగారు. వారు దాక్షిణాత్యులునుగారు. వారి వంశజుఁడొక్కఁడు దక్షిణదేశపు రాచకన్యక నొక్కతెను పెండ్లాడి, తన్మూలమున దానేరాజాయెను." (పల్లవులు పు. ౨౩) గిర్నారు శిలాశాసనమును జెక్కించినకాలమున, పశ్చిమక్షాత్రపరాజులు అపరాంతమున రాజ్యము సేయుచుండిరి. అప్పుడు పహ్లవుఁడొక్కఁడు వారికడ బ్రధానిగనుండెను. చుటునాగులు అపరాంతమున బ్రభుత్వము జేసినకాలమున (స్కందనాగుని తల్లియొక్క శాసనము. లూడర్సుగారి పట్టిక నె ౧౦౨౧ రు) పహ్లవులు వారి పొరుగున నుండిరి. ఒక పహ్లవకుమారుఁడు (prince) శివస్కంద నాగశాతకర్ణిరాజుయొక్క కుమార్తెను వ్వాహముజేసుకొని, కంచిరాజ్యమునుబడసెను.

'పల్లవోత్పత్తి విషయమునుగూర్చిన నావాదము సంగ్రహముగ నిదియే..."

దక్కను పూర్వచరిత్రము. పుట ౪౨-౫.

కాబట్టి దుబ్రే మతానుసారము, పహ్లవుఁడొక్కఁడు నాగరాజుకుమార్తెను బరిణయమై, తన్మూలమున కాంచీపురరాజ్యమును బడసి యచ్చట పల్లవవంశమును స్థాపించెను. అయితే దీనికొక యాక్షేపణ కలదు. శివస్కంద నాగశాతకర్ణుని కూతును పహ్లవ కుమారుఁడొకఁడు ద్వాహమై, తన్మూలమున గాంచీపురమున రాజ్యమును బొందెననుటకాధారములేదు. పల్లవకుమారుఁడు నాగకుమారి నుద్వాహము జేసుకొనిరాజ్యప్రాప్తి నందినట్లు శాసనములు జెప్పుచున్నవి; కాని పహ్లవుల నెచ్చటను బేర్కొనియైన నుండలేదు. పల్లవులును బహ్లవులును నొక్కరేయనుట కేమియు నిదర్శనములేదు. వారు భిన్నజాతులవారు. కావున పహ్లవు డొక్కఁడు నాగకుమారిని పరిణయమై, తన్మూలమున గాంచీపురరాజ్యమును బడసెననుట నిరాధారమైనవ్రాత. కావున దుబ్రే వాదము నిలువజాలదు.

ఇట్టివాదము వచ్చునని యూహించి దుబ్రే దక్కను పూర్వ చరిత్రయందే దానికిట్లు సమాధానము జెప్పియున్నాఁడు.

"బాలశ్రీయొక్క సుప్రసిద్ధనాసిక శిలాశాసనమునుగూర్చి చర్చించు సందర్భమున, గౌతమీపుత్రుఁడు పహ్లవులను క్రీ. శ ౭౮ లో బరాభూతులఁగావించెనని వచించితిమి. (ఎపి. ఇండి. సం. ౮ ప్లే ౧. ౬౦౯ పంక్తి ౨) మఱియు, క్రీ. శ ౧౫౦-వ సంవత్సరమున రుద్రదాముని మంత్రినువిశాఖుఁడనువాఁడు పహ్లవుఁడని గిర్నారుశాసనమువల్ల దెలుసు కొనుచున్నాము. (జునగఢ్ శాసనము: ఎపి. ఇండి. సం.౮ పుట ౩౬ ప్లేట్‌లో ౧౯-వ పంక్తి). ఈరీతిగ, క్రీ. శ. ౭౮ లో 'పహ్లావ' యని వ్రాయబడినమాట, క్రీ. శ. ౧౫౦ లో 'పహ్లావ' యని వ్రాయబడెను. గిర్నారుశాసనమును జూచితిమేని, అందులోని 'హ్లా' యను సంయుక్తాక్షరము 'ల్ల' యను నక్షరమును బోలియుండుటను గనుగొందుము. ఇంతేకాక, ప్రాకృతభాషలో వ్రాయఁబడిన మైదవోలు శాసనములో నీయక్షరసమస్య సులభముగ విశదీకరింపఁబడియున్నది. దానియందు 'పలవ' యని వ్రాయఁబడియున్నది. ఇది పల్లవశబ్ద మునకు సమానమైనది. ఏలన ప్రాకృతమున హల్లులకొప్పుడు నుద్విత్తమురాదు. హీరహడగల్లి శాసనము ప్రాకృతమున విరచితమైనను, అందు పల్లవశబ్దము ద్విత్తసహితముగ వ్రాయబడి యున్నది. తదనంతరము శాసనములభాష సంస్కృతమైనపుడు, 'పల్లవ' శబ్దమునకు 'రెమ్మ' యను నర్థము గల్పించుకొనవచ్చును. నామముల ఐక్యతవల్ల ప్రాచీనులగు కంచి రాజులు రుద్రదాముని మంత్రిసంతతివారేనను దలఁపు కలుగుచున్నది."

ద. పూ. చ. పుట ౫౫-౬).

దుబ్రేగారి వాదమునకును వీరభద్రరావుగారి వాదమున కును జాలమైత్రిగలదు. ఇద్దరును పహ్లవులే కాలక్రమమున దేశీయులతో గలసి, వారివేషభాషలను మతాచారములను నంగీకరించి పల్లవులైరను నభిప్రాయమును వ్యక్తపఱచిరి. వీరభద్రరావుగారు పల్లవు లాంధ్రులని నొక్కి చెప్పిరి. దుబ్రేయట్టి యభిప్రాయమును వ్యక్తపఱచి చెప్పలేదు. అయితే పల్లవు లాంధ్రులే యని వీరు 'పల్లవులు' అను తమగ్రంథము నందు జెప్పియున్నారు.

"సింహవిష్ణు, మహేంద్రవర్మల పూర్వీకులు తెలుగుఁ దేశమున నివసించుచుండి రని మనము సిద్ధాంతీకరించవలసియున్నది "మహేంద్రవర్మకు తెలుఁగుపేర్లుండుటకుఁ గారణము, అతఁడుగాని యతని తండ్రిగాని తెలుఁగుదేశమున రాజ్యము సేయుటయేనని నమ్ముచున్నాను."

"పెక్కు శతాబ్దములవఱకును, అనేకతరముల పల్లవరాజులు కృష్ణానదీ తీరమందలి గుంటూరు మండలమునందును, నెల్లూరుమండలమునందును రాజ్యము జేసిరి."—పల్లవులు. పుటలు ౩౧-౩౩.

ఇత్యాదివాక్యములవల్ల దుబ్రేగారి యభిప్రాయమున పల్లవరాజు లాంధ్రులేనని విశదమగుచున్నది.

డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారలు ప్రాచీన పల్లవులు ఆంధ్రులేయని యొప్పుకొనుచున్నారు. 'పల్లవులు' అను గ్రంథమునందు వీరిట్లనుడువుచున్నారు. "మనకు లభ్యపడిన నిదర్శనములు, వారు (పల్లవులు) ఆంధ్రులలో నొక్క వంశమువారనియును, ఒకవేళ సాతవాహనుల సాంబంధికులుగనో, తద్వంశజులుగనో, యుందురనియును దెలుపుచున్నవి." అయినను కృష్ణస్వామి అయ్యంగారికిని దుబ్రే వీరభద్రరావులకును కొంత యభిప్రాయభేదము గలదు. దుబ్రే మొదలగు వారనుకొనునట్లు పహ్లావుల వంశజులే పల్లవులైరని వీరునమ్మరు. పహ్లావులును పల్లవులును వేర్వేరుజాతులవారని నిరూపించుటకు వీరు క్రొత్తసాక్ష్యమును జూపిరి.

"క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దాంతమునను, పదియవ శతాబ్దారంభమునను, గూర్జర రాజులగు మహేంద్రపాల, మహీపాలుర యాస్థానమున రాజశేఖరుడను కవియుండెను. దక్షిణదేశమున పల్లవులరాజ్యమంతరించుచుండిన సమయమదియే. అతడు భువనకోశమను భూగోళశాస్త్రగ్రంథమును రచించెను. తనకావ్య మీమాంసలోని ౧౭-వ అధ్యాయమున విషయము మెక్కువగ దెలిసికొనగోరు వారాగ్రంథమును బఠించవలయునని చెప్పియున్నాడు. ఈకడపటి గ్రంథమున నాతడు హిందూదేశము నైదుభాగములుగ విభజించి, యొక్కొక్క భాగమునకును సంబంధించిన నదులను, పట్టణములను జేర్కొనియున్నాడు. అతడాయధ్యాయమున, మాహిష్మతీపురమునకు క్రిందిభాగమున విస్తరించు దక్షిణాపథము లేక దక్షిణదేశము పల్లవులదనియు, ఉత్తరాపథమున బృథూదకమునకు బైభాగము పహ్లావులదనియు నిర్ణయించియున్నాడు. 'పృథూదక' మను పేరు తరచుగా సింధునదిదై యుండును. పహ్లావులు, హూణకాంభోజ బాహ్లీకాదులతో జేర్పబడియున్నారు. కావున, పలుదేశముల గ్రుమ్మరి, యనేకవిషయములను - సంస్కృత విద్యాభివృద్ధిని గూర్చినవే యైనను - నెఱింగిన రాజశేఖరుని యభిప్రాయమున, పల్లవులును పహ్లావులును వేర్వేరు జాతులవారనియు, అందొకరు దాక్షిణాత్యులనియు, మఱియొకరు సింధునది కావలియొడ్డుననున్న సరిహద్దు దేశవాసులనియు దెలియుచున్నది. రాజశేఖరుడర్వాచీనుడనుటకు సందేహములేదు. అయి

నను, తనకాలమున, పహ్లావులువేరు పల్లవులువేరని జనసామాన్యము విశ్వసించుచున్న విషయమును వ్యక్తపఱచియున్నాఁడు."

(Journal of Indian History Vol. 2 pp. 25-26)

ఇట్లు కృష్ణస్వామి అయ్యంగారలు దుబ్రే వీరభద్రరావుల వాదమును పూర్వపక్షమును గావించిరి. తచ్ఛిష్యకోటిలోఁ జేరినవారగు సి. యస్. శ్రీనివాసాచార్యులుగారు తమగురువుల వారావాదమును విధ్వంసము జేసిరని నమ్ముచున్నారు. (పల్లవులు. పుట ౭). ఇది వాస్తవమా యనువిషయమును మనము బరిశీలించవలయును. రాజశేఖరునిసాక్ష్యము విశ్వాసార్హమే. అతఁడు క్రీ. శ ౧౦-వ శతాబ్దారంభముననుండినవాఁడు. అకాలమున జనసామాన్యము విశ్వసించున్న విషయమునే యాతఁడు వ్యక్తపఱచెనని యయ్యంగారలే యొప్పుకొని యున్నారుగదా! పల్లవులు భరతఖండమున క్రీ. శ. ప్రథమశతాబ్దమున శకులతోఁ బ్రవేశించిరనియు, అప్పటినుండి వారాంధ్రులతోఁ బోరాడుచు, దుదకాంధ్రరాష్ట్రమున స్థిరనివాసముల నేర్పఱచుకొని యచ్చటనే నిలచిపోయిరని శాసనములు బల్కుచున్నవికదా. కావున, రాజశేఖరునికి బూర్వమెప్పుడో పహ్లావులలో నొకతెగవారు చీలి సింధునది దాటి యచ్చటినుండి దక్షిణాపథమునకువచ్చి పల్లవులుగ మారియుండవచ్చును. సింధునది కావలనున్న పహ్లావులాపేరనే రాజశేఖరుని కాలమువఱకును నుండియుండవచ్చును. అట్లయిన రాజశేఖరుని కాలమున పహ్లావులుత్తరమునను పల్లవులు దక్షిణమునను నుండవచ్చును. వేర్వేరుజనులుగ పరిగణింపఁబడియుండవచ్చును. ఇందసంగతమేమియులేదు. శబ్దశాస్త్ర ప్రకారము పహ్లావ పల్లవశబ్దములొక్కటేనని అయ్యంగారలొప్పుకొనియేయున్నారు. ఇఁక పహ్లావులును, పల్లవులును ఒక్కజాతివారలేలకారాదు? కావున కృష్ణస్వామి అయ్యంగార్ల వాదము నిలువదు. ఇప్పటికి మనకున్న చరిత్రజ్ఞానానుసారము, వీరభద్రాదులు జెప్పునట్లు పహ్లావులే కాలక్రమమున పల్లవులైరను వాదము సరియైనదని యొప్పుకొనవలసి యున్నది.

# నే నే మి చే సే ది?

శ్రీ కే. ఎమ్. మున్షీగారు, బి.ఏ, ఎల్.ఎల్.బి., ఎమ్.ఎల్.సి.

పాఠకమహాశయుని నాస్వవిషయమై ఒకప్రశ్న అడుగుతున్నా. ఈస్థితిలో నే నేమి చేసేది? ఎవరిమీద నిందారోపణ చేయను? నాకు మాత్రం ఏఉపాయమూ కనబడడము లేదు. దానికి కారణ మేమంటే నేను ఎవరితో చెప్పినా వారంతా నవ్వి మళ్లీ నన్ను చూడకుండానే వెళ్లిపోతూఉంటారు. ఏవస్తువు అన్నిటికంటె నాసద్భాగ్యమని తలచినానో అదే నాదౌర్భాగ్యమై కూర్చుంది. ఆవస్తువు — నాభార్య.

ఇట్లనడములో నాభార్య కురూపి అనిగాని, పురాతనాచారాలు గలదనిగాని, చదువు రానిదనిగాని, రసికురాలు కాదనిగాని, పనికిమాలి నదనిగాని, ద్రోహి యనిగాని, చెడ్డస్వభావము కలదనిగాని తలపకుసుమా. ఈదోషా లేమీ ఆమెయందు లేనేలేవు. ఇందువల్లనే నాకు మరింత దుఃఖము. ఆమె శరీరమున, స్వరూపమున రూపవతి. ఇంతకన్న ఎక్కువ చెప్పడానికి నేను సమర్థుడననుకోను. ఆలోచనలో మహాదేవగోవింద రానడేకుగూడా నాలుగైదు సంఘసంస్కరణసిద్ధాంతాలు నేర్ప శక్తిగలది. బుద్ధియొక్క పదును విదేశీకత్తికివలె ఉండేది. బొంబాయియూనివర్సిటీ ఇంటర్మీడియటు ప్యాసయినది. ఇంత తెలివిగల యీామెపై నింద మోపితే నాలుక తెగిపడిపోతుంది. మొత్తముమీద సమస్తభారతవర్షాన కాశ్మీర మునుండి కన్యాకుమారివరకు వెదకి చూసినా ఇంత తెలివి, కార్యప్రవీణత, రసజ్ఞత, చతురత, సుస్వభావము గలస్త్రీని చూడలేము. అట్టిస్త్రీకి భర్త నయ్యేభాగ్యము నాకే కలిగింది.

శ్రీయుత డాహ్యాభాయి ధోళకాజీ "ఎవని యిల్లాలు సలక్షణంగా ఉంటుందో అతడు గుండెలమీద చేయివేసుకొని సుఖముగా నిద్రిస్తాడు" అని చెప్పినాడు. ఈలేఖకు డంటే నాకు చాలా గౌరవము. కాని యీమాటమాత్రం కేవలంఅబద్ధమని చెప్పవలసివచ్చింది. నా యిల్లాలు

నలక్షణమైనది—కాని ఒక్కనాడూకూడా సుఖముగా నేను నిద్రపో యిందిలేదు చెప్పు. ఇట్టిస్థితిలో నే నేమి చేసేది ? అసలు వ్యవహారానికి వస్తాను. నేను బి. ఏ. ప్యాసయినప్పుడు "ఇది" (నీకు తెలిసిందిగదా ఎవరో) 'ఇంటర్మీడియట్టు ప్యాసయినది. కాలేజీలో విద్యార్థులకు నేనే నాయకుణ్ణిగా గణింపబడుతుండినా, అందరూ ఈమె వెనకాలే పిచ్చి యెత్తినవాళ్లవలె తిరిగేవాళ్లు; కొందరు ఈమెపుస్తకాలను ఎత్తియివ్వ డానికి సమయము ఎప్పుడు దొరకునా అని వేచియుండేవాళ్లు. కొందరు ప్రతిదినం ఆమెను స్టేషనువరకు సాగనంపి వచ్చేవాళ్లు. ప్రొఫెసర్లందరు హామేషా ఆమెను "టీకి" తమఇండ్లకు పిలిచేవాళ్లు. ఆకాల మేమో సరె; బాగానే ఉన్నది. కాని మాపెండ్లి జరిగింది — నాకష్టాలుకూడా ప్రారంభమైనవి.

ఇంటిలోనూ, బయటా, స్నేహితులలోనూ, విందులలోనూ కూడా నాభార్యయని ఆమెను ఎవరూ అనేవారుకారు. కాని నేను మాత్రం ఆమెభర్తననే వాడుక. నేను రస్తామీద పోతూ ఉంటే "ఈమిష్టర్ ! ఆఈయన మిస్టర్ "క్ష—"—మన ఆమిస్ "మేనో" ఉన్నదే ఆమెభర్త. మిసెస్'క్ష' చాలా తెలివితేటలు కలది. నిజంగా ఆదర్శరూపం"అని యెవరో ఒకరు చెప్పుతూ నావైపు వేలుచూపుతుండే వారు. అటువంటప్పుడు ఈసేవకుణ్ణి చూచి లెక్కపెట్టే దెవరు ? వీడికి మర్యాద ఎక్కడనుంచి వస్తుంది?

చాలానాళ్లు స్నేహితులలో ఎవరైనా దారిలో కనబడితే 'ఓహో మిస్టర్'క్ష' — ఎక్కడికి ? మిసెస్'క్ష' — క్షేమమా ?' అని అడిగేవాళ్లు పెద్దలు ! నాక్షేమసమాచారముమాత్రం అడిగేవాళ్లు కారు. —"మిసెస్'క్ష—' చచ్చి నరకానికి పోయింది" అని చెప్పవలె నని బుద్ధిపుట్టేది చాలామాట్లు.

ఎక్కడైనా నలుగురుకూడి మాట్లాడుతుండేస్థలానికి నేను పోతే కడుచమత్కారంగా మాటలు తిప్పివేశేవాళ్లు. "హిందూకుటుంబము

ఎంత దుఃఖమయము! స్త్రీలు ఎంత అజ్ఞానులు! భర్తలు ఎట్టి కష్టాలు సహించవలె!" అని ఏమేమొ మొదలుపెట్టేవాళ్లు. ఆమాటలు వినగానే నాకు చెప్పిరానంత కోపము వచ్చి పిడికిలి మూతపడేది: ఎందుకంటే తరువాత వినబడే మాటలేవో ఎరుగుదువా "మన స్నేహితుడు 'క్షు-' చాలా అదృష్టవంతుడు. ఇతనికి అటువంటి కష్టాలేమీ లేవు. ఇతడేమో 'మేనాను'......" అని. నాగతి యేదో ఒకవిధంగా తెల్లవారుతుంది. ఈలోకంతాతసొమ్ము ఏమి తిన్నానని వీళ్లంతా ఇంత ఆడిపోసుకోవడానికి ?

స్నేహితులు జాబులు వ్రాసేటప్పుడుకూడా రెండువైపుల "మిసెస్ 'క్షు—' సమాచారము తెలుపుము. మిసెస్ 'క్షు—'కు నావందనములు తెల్పుము" అని వ్రాసేవారు. కాని నాక్షేమ సమాచారము అడిగేవారు గాని, నాకువందనాలు చేసేవారుగాని, నాసమాచారము తెలుసుకోవడానికి కుతూహలం ఉన్నవారుగాని కనపడేవారేకారు. కొందరేమో నిర్మొగమాటంగా 'మై డియర్ మిసెస్' అనే జాబులు వ్రాసేవాళ్లు. ఇప్పటినాగరికతయొక్క సందర్భాల ననుసరించి ఇవన్నీకూడా ఓర్చుకోవలసివచ్చేది. అంతకన్న నే నేమి చేసేది ?

• నేను నిరర్థకపు ముద్దురాచ్చిప్పననో, చాలా వెలగల ఆడసింహమును పెంచేవాడిననో, లేకపోతే ఎవరో గొప్పమహారాణీకి నేను అంతరంగికకార్యదర్శిననో కాబోలు వారిఅభిప్రాయము! నేను మాత్రం ఏమి సామాన్యుడనా? ఎం. ఏ. ప్యాసయినా. వ్యవహారవిషయాలలో అందరికన్న సమర్థుడను. ఇట్టి తెలివితేటలు కలిగీకూడా ఇటువంటి బాధలుపడడము— నాభాగ్యమే కాబోలు!

ఇంటిలోకూడా నాకు చాలావత్తిడి కలిగేది. ఒకసారి "మేనాకు" తలనొప్పి వచ్చింది. ఇందులో నాతప్పు ఏముంది? ఆఫీసుకు పోవలసి మెట్లు దిగి వస్తూ ఉండగా మాచుట్టుప్రక్కలవాళ్లు క్రిందచేరి ఆడుకొంటూఉన్నమాటలు వినబడితే అవి వింటూ నిలుచున్నా.

'పాపము ఆమెకు చాలా జబ్బుగా ఉంది ఈదినం—'

'జబ్బు చేసిందంటే చేయదుమరి! ఆమె భర్త పట్టి మృగంమాదిరి దయా దాక్షిణ్యం లేకుండా ఉంటాడు.

'వీళ్లిద్దరికీ ఏదో తగవు వచ్చినట్లుంది చూస్తే. బాగా చదువు కొన్నవాడని పేరేగాని ఈమెను మాత్రం ............'

అని మాట్లాడుకుంటూ ఉన్నారు. మిసెస్ 'క్ష—'కు తలనొప్పి వచ్చినా తప్పంతా నాదే. ఇంకా నే నేమో తగువులాడినానని అను కుంటున్నారు. అదంతా వీళ్ల కెందుకో! మిసెస్ 'క్ష—' చస్తేనేమి బ్రతికితేనేమి వీళ్ల తలపండేమి పగిలిందో—ఇంటిలో తలిదండ్రులకు కూడా అదే అభిప్రాయం 'అబ్బాయీ! మనఅమ్మాయికి ఇంతజబ్బుగా ఉన్నా నీవు ఏమీ చేయడములేదే! ఆమెను చాలాకష్టపెడుతున్నావు.' అని పలుమారు వాళ్లు నన్ను అడిగేవాళ్లు—ఇట్లా యింట్లోఆవిడే యజ మానురాలూ, నేనే ఆవిడసేవకుణ్ణీ అయినాము.

ఇంతటితో నాపీడ వదలితే చాలా బాగానే ఉండేది. ఆఫీసు నుండి అలసి సొలసి ఇంటికి వచ్చి, సహధర్మచారిణి కదాఅని ఆమెతో కూడా రెండునిమిషాలు ఏకాంతముగా కూర్చొని సర్దాగా మాట్లాడు కొందామని ఉవ్విళ్లూరుతుండేటప్పటికల్లా మాస్నేహితులలో ఎవరో ఒకడు తలుపు తట్టుతూ వాకిలివద్దర ప్రత్యక్షమై.

'మిస్టర్ 'క్ష'— ఎట్లా ఉన్నావు? క్షేమమా? మిసెస్ 'క్ష—' ఖులాసాగా ఉన్నారని తలుస్తా. ఈవేళ ఒంట్లో ఏమీ బాగాలేదు. అం దువల్ల 'మేనా' ఇంట్లో కొంతసేపు కూర్చుందామని వచ్చాను.' అంటూ మందహాసముచేస్తూ లోపలికి వస్తూఉంటాడు.

'ఏదైనా పనిమీద వచ్చావా' అని అడిగితే చేతిరుమాలుతో ముఖం తుడుచుకుంటూ 'తొందరపని ఏమీ లేదు. మావదినె మేనాను చూచి చాలారోజు లైనది. ఆవిడను చూద్దామని వచ్చాను. అదీగాక చాలాసుస్తీగా ఉన్నది ఈదినం' అని అంటాడు.

సరే. బాగానే ఉన్నది. అన్నగారి భార్యను చూడడానికి వస్తాడు. అతడు ఖులాసాగా ప్రక్కన కూర్చొని మేనాతో సంభాషిస్తూ ఉంటే

ఇదంతా దూరంగా ఉండి వింటూనోరు తెరుచుకు కూర్చోవాలి. అదైనా తొందరగా ముగించి బయటికిపోతాడనుకుంటే ఛీ వాడెందుకు పోతాడు? తనపూర్వపుకష్టాలూ, తానుచేసినప్రయాణాలూ, తనఅల్లరులూ చిలవలూ పలవలూపెట్టి వర్ణనచేస్తూ కూర్చుంటాడు. 'మేనా' బహుశ్రద్ధగా ఆలకిస్తూ' నిట్టూర్పులువిడుస్తూ ఒకటిరెండుగంటలైతేనేకాని వాణ్ణిఇంటికి పంపదు. మరొక రెవరియింటికైనా పోయి యీలాగు వారిభార్యలతో మాట్లాడడానికి వీలులేక ఇష్టంవచ్చినప్పుడల్లా వాడు నాయింటికే వస్తూ ఉంటాడు. నాయిల్లు రచ్చసావడి అనుకుంటాడో సత్రంఅనుకుంటాడో. ఒక రోజురాత్రి పదకొండుఘంటలప్పుడు 'మేనా' కోకిలకంఠంసారించి పాడటం మొదలుపెట్టింది. ఒకపాట తర్వాత మరొకపాట దివ్యంగా పాడుతున్నది. కలగక కలగక కలిగిన అదృష్టానికి పొంగిపోతూ నేను కూర్చున్నా. కొంత సేపైనతర్వాత ఊరికే కిటికీదగ్గరకు పోయి చూస్తినిగదా, పదిహేను ఇరవైమంది మెడలు పైకెత్తి, వాళ్లపుట్టిమునిగినట్టు మాకిటికీ వైపు చూస్తూ రోడ్డుమీద నిలబడ్డారు. నాకు ఒళ్లు మంటెత్తుకు వచ్చి దబాలున కిటికీ మూసివేశాను. మాగది మొదటి అంతస్థులో ఉన్నది. జనం అట్లా రోడ్డుమీద కిటికీ కెదురుగా నిలబడకుండా చేయవలసినదని మరుసటిదినం ఇంటియజమానితో గట్టిగా చెప్పినాను. నేనింత జాగ్రతపడినా 'మేనా' సంగీతము వింటూ రోడ్డుమీద నిలబడే వాళ్లసంఖ్య యేమైనా తగ్గిందాఅంటే అదేమీ లేదు. నేనేమిచేసేదంట? ఇటువంటివి ఎన్నో అహర్నిశాలు జరుగుతూఉండడముచేత నాస్వభావము చాలా చెడిపోయింది. నే నేమిచేసేది? ఏస్నేహితుడికీకూడా నా మొఖమంటే సరిపడేది కాదు. ఇంకెవరి ఇంటికైనా పోదామంటే నాకు ఇష్టమయ్యేది కాదు. ఇంట్లో కూర్చుందామాఅంటే అది అన్నిటికన్న కష్టముగా తోచేది. ఎవరైనా వచ్చి 'మేనా'తో మాట్లాడిపోతారేమో. ఆమె నవ్వుల భాగ్యం వాళ్లే అనుభవిస్తారేమో అనే దినమంతా నాకలవరం. అన్నిటికంటె పెద్దపీడ మరొకటి. ఈనాదుఃఖము ఎవరితో చెప్పుకునేది? 'మేనా'తో చెప్పుదామాఅంటే ఆవిడ అన్యథా తలుస్తుందేమో

అని భయం. ఇంకొకరి కెవరికైనా—ఎట్లా చెప్పడమిది? అథవా చెపుతామయ్యా చెపితే నవ్వి వెళ్లిపోతారు. ఎవరికీ చెప్పకుండా ఊరకుందామంటే రోజుకురోజు లోపల కాలి చచ్చిపోతున్నా. చాలాకాలము 'మేనా'పై చాలా విసుగుకొన్నా. స్త్రీవిద్య అంటే చాలా అసహ్యం కలిగింది. 'మేనా' గాక ఇంకెవతెనైనా అజ్ఞానురాలినీ కురూపినీ పెండ్లిచేసుకొని ఉంటే ఎంతో సుఖంగా ఉండేవాణ్ణి. నేనుతప్ప మరెవ్వరూ ఆమెమొదుటకు పోయ్యేవారుకారుగదా అని అనుకొనేవాణ్ణి. ఇంతేగాక, ఇవి విద్య, నాగరికతయొక్క దినాలు. అందరూ స్వాతంత్ర్యోపాసకులు; కొంచెము కఠిననిబంధనాలు ఏర్పరుస్తానంటే 'చూడు, చూడు. ఇంతఅధికముగా చదువుకొనీకూడా భార్యను బయటికి పోనివ్వడ'ని అందరూ గగ్గోలు పెడతారు.

ఎంతటి దౌర్భాగ్యుణ్ణి అయినాను. నేనే పెద్ద బాదుషానైతేనా తక్షణమే ఘోషాపద్ధతి తప్పకుండా ఉండవలెనని శాసించేవాణ్ణే. ముక్కు చెవులూలేని స్త్రీలుమాత్రం నెత్తిన బురకాలేకుండా రస్తాలమీద పోవచ్చుననేవాణ్ణి. ఇప్పుడు మనపూర్వాచారాల రహస్యము నాకు చక్కగా బుర్రకెక్కింది. ఈశాసనాలు అమలులోకి వచ్చేవరకూ ఎవరూ మరొకళ్ల ఇండ్లకు పోగూడదనీ వాళ్లమాటలు వినగూడదనీ వాళ్లపాటలు చెవులలో పడితే చెవులు మూసుకోవలెననీ వీటి నుల్లంఘించేవారికి మరణశిక్ష తప్పదనీ దండోరాద్వారా నగరమంతా చాటించేవాణ్ణి. నాఉద్దేశం దీనివల్లకూడా నెరవేరకపోతే చదువురాని ఆడవాళ్లూ కురూపులైన ఆడవాళ్లూ తప్ప మిగతావారినందరిని నారాజ్యములోనుంచి వెళ్లగొట్టించేవాణ్ణి. లేకపోతే యీయీతిబాధ తప్పించుకునేదెట్లా? కాని బాదుషాను అయ్యేఉపాయము ఏమీ కనబడడం లేదు. ఒకవేళ సామాన్యుడనుగా పుట్టవలెననే నానెత్తిని వ్రాసిఉంటే వెయ్యిసంవత్సరాలు ముందైనా పుట్టిఉంటే చాలా బాగా ఉండేది. అప్పుడు 'మేనా' నాకష్టాలు కొంతవరకు తెలుసుకొని వాటిని తగ్గించేటందుకు ప్రయత్నాలు చేసేది. నాసద్భాగ్య మింతమాత్రమే. ఇదే

నాకు కొంత ఓదార్పు; కాని సుఖము మొదలేలేకుండా ఎంత ఓదార్పు ఉన్నా ఏమి లాభం! నాకష్టాలూ నాదుఃఖాలూ ఏమీ తగ్గలేదు. నాబ్రతుకు మరింత మరింత మొద్దుబారిపోయింది. దీని నివారణ కేమైనా మార్గ మున్నదా? మార్గముంటే త్వరగా చూపు. లేకపోతే మనకన్నుల యెదుటనే స్త్రీవిద్య అధికమైపోతున్నది. ఈదినం నావంతు. రేపు నీది. జాగ్రత్త.

[ఈకథను మాతృకయగు గుజరాతీనుండి తర్జుమా చేసినాము. ఇది శ్రీకన్హైయలాల్ మాణిక్‌లాల్ మున్షీ, బి. ఏ., ఎల్. ఎల్. బి., యం. యల్. సి. గారిది. వీరు బొంబాయి హైకోర్టులో కొంతకాలము అడ్వొకేటుగా నుండిరి. బొంబాయి యూనివర్సిటీతఃఫున యం. ఎల్. సి. గానుండిన పరంజపేగారు ఇండియాకౌన్సిలు సభ్యులుగా నియమింపబడి ఇంగ్లండుకు పొయ్యేటప్పుడు ఆయన రాజీనామా ఇచ్చియుండిరి. అప్పుడు జరిగిన ఎన్నికలలో తీవ్రమగుపోటీ యుండినను వీరు అధికసంఖ్యాకులచే ఎన్నుకొనబడి యం. ఎల్. సి. అయిరి. బొంబాయి యూనివర్సిటీ సెనేటుసభ్యులుకూడను.

మహాత్మాగాంధిగారిని మినహాయించిన, ప్రస్తుతము గుజరాతీవచనము వ్రాయువారిలో వీరే అగ్రగణ్యులు అని చెప్పవచ్చును. వీరికథలు 'పాటణ్‌నీప్రభుతా,' 'గుజరాత్‌నో నాథ్,' 'పృథ్వీవల్లభ్' మున్నగు నవలలు చాలా పేరుపడసినవి. వీరిభార్య లీలావతిమున్షీ కూడా చాలాకథలను, విమర్శనలను వ్రాసినది. 'రేఖాచిత్రో అనేబీజాకాథో' అను ఈమె గ్రంథము ఇటీవల ప్రచురింపబడినది. వీరిద్దరును 'గుజరాత్' అను సచిత్రమాసపత్రికను బొంబాయినుండి ప్రచురిస్తున్నారు. ఇదే గుజరాతీలో శ్రేష్ఠమైన మాసపత్రిక.

బెర్నార్డుషావలె కన్హైయలాలుకుగూడ సాంఘికసమస్యలపై వింత అభిప్రాయములు గలవు. వీటిని చదువరులు శ్లాఘిస్తారు గాని యనుసరించడానికి కష్టపడరు. యువకులకు వీరంటే చాలప్రీతి. వీరి యభిప్రాయములగూర్చి ఒకానొకవిమర్శకుడు ఈరీతి వ్రాస్తున్నాడు:—

**He is indifferent to the society, because he could not get something from it which he wanted. In his pride he does not complain before it, but despises it all the more; and takes a delight in criticising it and tearing it to pieces before his mental eye. He does not like sympathy because he thinks it lowers his dignity.**

బెజవాడ గోపాలరెడ్డి (అనువాదకుడు)]

# సోమలదేవి రాజరాజనరేంద్రుని కుమార్తెయా?

శ్రీ నడింపల్లి జగన్నాథరావుగారు.

ద్రాక్షారామమునందుగల సోమలదేవిశాసనమునుబట్టి పూర్వ చాళుక్యరాజగు రాజరాజనరేంద్రునకు ప్రథమకులోత్తుంగ చోళదేవుని తల్లియైన అమ్మంగదేవి యనుభార్యగాక "రేవలదేవి" యను రెండవ భార్య యుండెననియు, నామెకు "సోమలదేవి" యనుపుత్రిక పుట్టెననియు శ్రీయుత కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు చెప్పియుండిరి.[1] ఈశాసనము శా. శ. 987 (క్రీ. శ 1065) సంవత్సరమున పుట్టినటుల గన్పట్టును. అందొక్క సంస్కృత శ్లోకమును, పిమ్మట తెలుగున సీసపద్యమును, ఆటవెలదియును గలవు.

శాసనము[2]

(స్రగ్ధరా).

శాకే సంత్సరేషు మునిని వసు నిధిగే
రాజమార్తాండభూభృ
త్పు[త్రే సారంగ] నేత్రే కనకవిరచితం
కల్పభూజాతపుష్పం
ప్రాదా ద్భీమేశ్వరాయ వ్యదిశ దథ సదా
దీప్య దాచంద్రతారం
దీపం కాంస్యంచపాత్రం బిససదృశభుజా
రేవిదేవీతనూజా॥ ౧॥

సీ॥ శ్రీవిష్ణువర్ధన భూవిభుదయు భూమి
దేవిబోల్ రేవలదేవి కనిన

1. శ్రీరాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక పేజి. 25-29.

2. రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక పేజి. 28-29.

సోమలదేవి గుణారామ జగదేక
సున్దరి మత్తేభ మందగమన
దొల్లి భీమేశ్వర వల్లభునకు సిత
మణి [బన్ధ మి]చ్చె సన్మణియుతముగ
నురు విచ్చె గంగనాం బరుపిషి వినివారిం
బురుడిం[చున]ట్ల [యాసరసిజాస్య
గనకరచితరుచిర కల్పావనీరుహ
కుసుమ మిచ్చెం దనకు సనము వెరుగ
వెణ్డిమణ్డతో నఖణ్డితద్యుతి దీప
మమర నిచ్చె విమలకమలనేత్రి. ౨॥

ఆ॥ వె॥ సకలవసు[మతీ]శమకుటసద్ర[త్న]
కిరణరుచివిరాజ చరణుణ్డాయిన
కాంతు సరియె పోల్ప గాంత లెందు॥
నిజభుజప్రధాని [భై]జయిత దేవని.

లిఖితః పెద్దనాచార్యః.

చివరపద్యమగు ఆటవెలదియందలి నాలవచరణము మూడవ చరణమయి యుండవలసినటులఁ దోచుచున్నది. శాసనము చెక్కునాతఁడు పొరపాటున మూడవచరణమును వదలి నాలవచరణమును చెక్కియుండినటులను, పిమ్మట తనలోపమును గ్రహించి యాఖరున వదలి వేసిన మూడవచరణమును చెక్కినటులను యూహింపఁదగియుండును.

సోమలదేవిజననాదికములఁగూర్చి చెప్పుటలో సంస్కృతశ్లోకమున
"రాజమార్తాండ భూభృత్పుత్రీ నారంగనేత్రీ"
అనియు, సీసపద్యమున
"శ్రీవిష్ణువర్ధనభూవిభుదయ భూమి
దేవిబోల్ శేవలదేవి కనిన
సోమలదేవి గుణారామ జగదేక
సున్దరి మత్తేభమందగమన"

అనియు, ఆటవెలదియందు

"నిజభుజప్రధాని బెజయితదేవని
కూంతు సరియె పోల్ప గాంతె లెందు".

అనియు జెప్పఁబడియున్నది. దీనినిబట్టి శాసనకర్త్రియగు సోమలదేవితండ్రి రాజమార్తాండుఁడనియు, విష్ణువర్ధనుఁడనియు, బెజయితదేవుఁడనియు పేర్కొనఁబడియుండెనునుట స్పష్టము.

ఆంధ్రభారతమునందు

"కం॥ రాజమహేంద్రకవీంద్రస
మాజసురక్ష్మాజ రాజమార్తాండ ధరి
త్రీజనసుతచారిత్ర వి
రాజితగుణరత్న రాజరాజనరేంద్రా[1] ॥

అని నన్నయభట్టు చెప్పియుండుటచే రాజరాజనరేంద్రునకు రాజమార్తాండుఁడనియు విష్ణువర్ధనుఁడనియు బిరుదములు గలవనియు, శాసనములోఁ జెప్పఁబడినబిరుదము లీరాజరాజనరేంద్రునిబిరుదములకు సరిపోవుచుండుటచే శాసనకర్త్రియగు సోమలదేవితండ్రి రాజరాజనరేంద్రుఁడని శ్రీయుత లక్ష్మణరావుపంతులుగారు స్పష్టీకరించినటులఁ గన్పట్టుచున్నది.

మూడవపద్యమునందలి మూడవచరణమునందు మొదటిరెండు చరణములందువలెనే రాజరాజువిశేషణములు కలవనియు, "నిజభుజప్రధాని" అనగా నిజభుజమే ప్రధాని (మంత్రివలె న్యాయముచేయునది) ఎవనికో యని బహువ్రీహి చేసుకొనవలయుననియు, "బిజయితదేవని" అనగా "విజయాదిత్యదేవని" యని యభిప్రాయమైనటులను, విజయాదిత్యపదము "బిజయిత"గా మారుటలో నాశ్చర్య మేమియు లేదనియు, రాజరాజునకు "విజయాదిత్య" యన్నబిరు దున్నట్లు భారతమునందు గానిపించలేదనియు జెప్పియుండిరి. రాజరాజనరేంద్రునకు భారతమునందేగాక మఱియెచ్చటనుగూడ విజయాదిత్యుఁ డనునామముగాని బిరుదముగాని యుండినటుల గన్పట్టుటలేదు.

1. ఆంధ్రమహాభారతము, ఆదిపర్వము II. 288 పద్యం.

శాసనకర్తయగు సోమలదేవి తానెవ్వనికుమార్తయో స్పష్టము గనే జెప్పుకొనియున్నది. వేఱువిధముగ భ్రమపడుట కనకాశమే గాన్పించదు. మూడవపద్యము నొకపరి యోచించిన స్పష్టమగును. ఆపద్యమున కర్థమిట్యాదియని తోచుచున్నది.

"సకలవసుమతీశమకుటసద్రత్న కిరణరుచివిరాజితచరణుఁడైన ట్టియు, నిజభుజమే ప్రధానముగా గలిగినట్టియు అనగా అట్టితనరాజ్య పదవికి తనభుజబలమే ప్రధానముగా గలిగినట్టియు — లేక శ్రీలక్ష్మణ రావుపంతులుగారిమతమున ఎవనికి నిజభుజమే ప్రధాని అనగా మంత్రి వలె సాయముచేయునది అయియుండెనో అట్టి — విజయాదిత్యదేవుని కూతుతో (అనగా శాసనకర్తయగు సోమలదేవితో) నితరకాంత లెవ్వరైనను సరిపోల్పదగుదురా? (సరిపోల్చతగరని భావము).

ఇందు సోమలదేవి "విజయాదిత్యుని" కుమార్తెయైనటుల స్పష్టముగ జెప్పుకొనియున్నది. శాసనమునందలి విషయములనుబట్టి యామె తండ్రి విజయాదిత్యదేవుఁడనియు, నాతనికి రాజమార్తాండుఁడు విష్ణువర్థనుఁడు అను బిరుదునామము లుండినటులను దెలియుచున్నది. విజయాదిత్యనామము లేకుండగ రాజమార్తాండుఁడు, విష్ణువర్ధనుఁడు సను బిరుదునామములు రెండును రాజరాజనరేంద్రున కుండినమాత్రమున నాతఁడే యీతఁడని నిరూపించుట కగునా? శాసనకర్తతండ్రి రాజమార్తాండ, విష్ణువర్ధనబిరుదునామములుగల విజయాదిత్యుఁడని చెప్పుటయే యెక్కువ సమంజసముగ గన్పట్టుట లేదా?

ఈశాసనము శా. శ 987 (క్రీ. శ. 1065) సంవత్సరములో పుట్టబడినది. అప్పటికి రాజరాజనరేంద్రుని పరిపాలనము స్వల్పకాలము క్రిందటనే యంతమయ్యుండెను. రాజరాజనరేంద్రుని యనంతర మాతని సోదరుఁడగు విజయాదిత్యుఁడు చాళుక్యరాజ్యమును పాలించుచుండి నటుల చరిత్రాంశములనుబట్టి గన్పట్టుచున్నది. విజయాదిత్యునకు విష్ణువర్ధనుఁ డనునామ మున్నటులను గన్పట్టుచున్నది. రాజమార్తాండుఁడన రాజులకు (లేక రాజులలో) సూర్యునివంటివాడని భావము. ఆబిరుదము

ప్రతాపశాలియగు ప్రతిభూపతికిని చెల్లును. సామాన్యభూపతులునయి తము రాజమార్తాండు డనుబిరుదమును జెప్పుకొనియుండిరి. నిజభుజమే ప్రధానముగా గలవాడని చెప్పఁబడిన విజయాదిత్యుఁడు రాజమార్తాండుడని పేర్కొనఁబడుట యబ్బురముగాదు. విజయాదిత్యుఁడు నిజభుజమే ప్రధానముగా గలవాడని చెప్పఁబడుటకు కారణ మేమియైయుండునో మన మారయవలసియుండును. ఇప్పట్టున నక్కాలమందలి రాజకీయపరిస్థితు లొకపరి సింహావలోకనము గావించిన యొకింత బోధపడ గలదని తలంచెద.

రాజరాజనరేంద్రుని యనంతరము చాళుక్యరాజ్య సింహాసన మెక్కుట కాతనికుమారుఁ డర్హుడు. న్యాయశాస్త్రసమ్మతము. అతనికి ప్రథమకులోత్తుంగ చోళదేవుఁ డను కుమారుఁ డుండినటుల చరిత్రకారు లందు రొప్పుకొను విషయమే. ఈకులోత్తుంగునకు రాజేంద్రచోడుఁడని మొట్టమొదటినామము. చోళసింహాసనాధిష్ఠుఁ డయినపిమ్మట కులోత్తుంగ చోళదేవుఁ డనునామమును వహించెను. రాజరాజనరేంద్రుని పరిపాలనా కాలమున యువరాజుగ నుండెను. అప్పట్టున నితరదేశములపై దండు వెడలి మధ్యరాష్ట్రము (Central Provinces)లోని వాయిరాసగర మను ప్రదేశమును వశపరుచుకొని ధారావర్షునిచే పరిపాలింపఁబడుచుండిన చక్రకోట్యమును ముట్టడించి వశపరుచుకొనినటుల చెప్పఁబడియున్నది.[1] చక్రకోట్య మనునది బస్తరురాజ్యములో నున్నది. దీనినిబట్టిచూడ నారాజేంద్రచోడుడు సమర్థుఁడును, పరాక్రమవంతుడును, ప్రతిభాశాలియు నైయుండినటుల గాన్పించుచున్నది.

రాజేంద్రచోడుఁడుగాక రాజరాజనరేంద్రునకు విజయాదిత్యుఁ డనుమఱియొకకుమారు డుండినటుల గంజాముమండలములోని శ్రీకాకుళ ముతాలూకా శ్రీకూర్మములోని కూర్మేశ్వరస్వామియాలయమందలి శాసన మొకదానివలన దెలియుచున్నది.[2] ఈశాసనము[3] రాజరాజు[4]

1. Ep. Ind. Vol. IX page 178 ; E. R. No. 538 public of 28 July 1909 para 66.
2. E. R. No. 352 of 1896; Ep. Ind. Vol. V pp. 32-34).
3. Adi Saka 1195. ౮౩౨
4. Minister of Veeranarasimha.

కుమారుఁడగు రెండవవిజయాదిత్యునిచే బ్రచురముచేయఁబడినది. అందు రాజమహేంద్రవరమును పరిపాలించిన విమలాదిత్యునియొక్కయు మహాభారతమును తెనుగున భాషాంతరీకరణమును చేయించిన అతని కుమారుఁడు రాజరాజనరేంద్రునియొక్కయు వంశములోనివాఁడనని శాసన కర్త చెప్పుకొనియుండెను. అం దాతనివంశవర్ణనము గావించుపట్టున విమలాదిత్యునికుమారుఁడు మహాభారతమును తెనుగున భాషాంతరీకరణమునుచేయించిన రాజరాజనరేంద్రుఁడనియు నాతనికుమారుఁడు విజయాదిత్యుఁడనియు, ఆతనికి రాజరాజు కుమారుఁడనియు నీరాజరాజు గంగవంశజుఁడగు ధీరనరశింహుని సామంతుఁడనియు, ఆరాజరాజునకు తాను పురుషోత్తముఁడును కుమారులైనటులను జెప్పుకొనియుండెను.

మఱియు ప్రథమకులోత్తుంగచోళదేవునకు గంగయకొండచోడుఁడనుమరియొకసోదరుఁ డుండినటుల గన్పట్టుచున్నది.[1]

ఇటుల రాజరాజనరేంద్రునకు ముగ్గురుకుమారు లుండినటుల గన్పట్టుచున్నది. ఆతనియనంతరము చాళుక్యరాజ్యాధిపత్య మాతనిపెద్ద కుమారుఁడును యువరాజు నగురాజేంద్రచోడునకు సంక్రమించవలసియుండెను. ఆవిధిగాక రాజరాజనరేంద్రుని సోదరుఁడగు విజయాదిత్యుఁడు సింహాసనమునకు వచ్చియుండెను. కారణ మూహింప రాజరాజనరేంద్రుని పరిపాలనాంతిమకాలమున ప్రతాపశాలియగు విజయాదిత్యుఁడు తనసోదరుని రాజ్యభ్రష్టుని గావించి సింహాసన మాక్రమించుకొనుటకై కుట్రలుపన్నుచు సమయమునకై వేచియుండి మిగుల ప్రజ్ఞావంతుఁడును, అవక్రవిక్రమపరాక్రముండును రాజరాజనరేంద్రుని జ్యేష్ఠపుత్రుఁడును, యువరాజు నగురాజేంద్రచోడుఁడు చాళుక్యరాజ్యమును వదలి మాతామహునిరాజ్యమగు చోళరాజ్యసింహాసనముకై తగవులాడుచు చోళదేశమునం దుండెడి యవకాశము చూచుకొని రాజరాజనరేంద్రునిపై తిరుగుబాటొనరించి, రాజ్యభ్రష్టుని గావించి, సంహరించి, చాళుక్యరాజ్యసింహాసన మాక్రమించుకొనియుండినటులఁ దోచుచున్నది. తనభుజబల

1. Inscriptions of Chidambaram, Dr. Burnells South Indian Palaeography Page 45. foot note 1. Sewells Antiquities Vol. II. Page. 157.

ముచే నాప్రకారము గావించికొనియుండుటచే నీశాసనమున విజయాదిత్యునకు విశేషణపదముగ నుపయోగింపఁబడిన "నిజభుజప్రధాని" యను వాక్య మాభావమును సూచించుటకై ప్రయోగింపఁబడినటుల స్ఫురించుచున్నది. ఈశాసనము రాజరాజనరేంద్రుని పరిపాలనాకాల మంతమయిన బహుస్వల్పకాలముననకే పుట్టబడినదై యుండుటచే నాయూహనే బలపరుచుచున్నది.

కావున శాసనములోని విషయములను, అప్పటి రాజకీయపరిస్థితులను పరికించిచూచినచో సోమలదేవి రాజరాజనరేంద్రుని కుమారిత కాదనియును, రాజరాజనరేంద్రుని సోదరుఁడును, రాజరాజనరేంద్రుని యనంతరము చాళుక్యరాజ్యసింహాసనము నాక్రమించుకొనినవాఁడు నగువిజయాదిత్యుని కుమారితయనియును గన్పట్టుచున్నది.

మఱియు దక్షిణార్కాడుజిల్లాలోని చిదంబరమునందలి దేవాలయములోని శాసనములుకొన్ని రాజరాజనరేంద్రునకు రాజరాజకుండవయి మధురాంతకి యనుకుమార్తె లిద్దఱుండినటులఁ జెప్పుచున్నవి.[1] అందు తాము రాజరాజనరేంద్రుని కుమార్తెలమనియు కులోత్తుంగచోళదేవుని తోబుట్టువులమనియు జెప్పుకొనియుండిరి. కులోత్తుంగుని పరిపాలనావత్సరముల జేర్కొనియుండిరి. ఈసోమలదేవిశాసనముకూడ రాజరాజనరేంద్రుని యనంతరము పుట్టబడియుండెను. అందు రాజరాజనామము బేర్కొనబడి యుండలేదు. రాజరాజనరేంద్రునికుమార్తెయేయైయుండిన తాను రాజరాజనరేంద్రునికుమార్తెనని చెప్పుకొనియే యుండును. లేదా తనసోదరుఁడగు రాజేంద్రచోళుని బేర్కొనియేయుండును. శాసనములో తనతండ్రినిగూర్చి చెప్పుటలో నుపయోగించిన విశేషణపదములనుబట్టిచూచిన నతడప్పుడు పరిపాలనచేయు ప్రభువయి యుండినటుల బోధపడును. శాసనకాలమున నచ్చట విజయాదిత్యుఁడు పరిపాలనసల్పుచుండెను. అయ్యదియు నామె విజయాదిత్యునికుమారితె యనియే సూచించుచున్నది.

నర్సారావుపేట.

నడింపల్లి జగన్నాథరావు.

1. E. R. No. 118 of 1888. Ind. Ant. Vol. XXIII Page 298: Ep. Ind. Vol. IV. Page 70: Ep. Ind. Vol. V Pages 105, 106 and E. R. No. 117 of 1888.

# భూమి పన్ను.

శ్రీ కో. సత్యనారాయణమూర్తిగారు, ఎమ్. ఏ.

(సర్వస్వామ్య సంకలితము.)

తే॥ ధనములకు ధాన్యములకు నుత్పత్తితలము
లయిన వాని కించుకయును హానిగాక
యుండఁ దనకును బండార మొదవఁదగును
పార్జనము సేయవలయు భూపాలకుండు॥

మహాభారతము - శాంతిపర్వము.

దయాపరిపూర్ణుఁడైన జగద్రక్షకుడు మనకు ప్రసాదించిన వివిధైశ్వర్యములలో విశాల భూభాగమును విశేషవర్షాతపములును ప్రధానములు. సర్వసమృద్ధమైన ప్రకృతిసంపదకును అనంతమగు ప్రాణికోటికిని భూమియే తల్లి. భూమిని దున్నుట నాగరికతయొక్క ప్రథమ చిహ్నము. దస్యులతో యుద్ధములు ముగిసినవెనుక సుస్థిరమైన యిండ్లు వాకిండ్లనేర్పరుచు కొనిన ఆర్యులకు సీతామహాలక్ష్మి నాగటిచాలులో భూమినుండి పుట్టినది.

పన్ను లన్నిటిలో భూమిపన్ను మిక్కిలి ప్రాచీనమని కొందరిమతము. తలపన్ను, గుడిసెలపై పన్ను - ఇవి అంతకన్న ప్రాచీనమని మఱికొందఱి అభిప్రాయము.

## భూమిపన్నును విధించు విధములు.

వైశాల్యమునుబట్టి భూమిఅంతటిపై నొక్కరీతున పన్నును విధించుట సులభమైన పద్ధతి. అందువలన సారవంతములైన భూములమీదను, సారహీనములైన భూముల మీదను పన్నులబరు వొక్కవిధముగా బడును. వ్యవసాయ మభివృద్ధిజెందక, చాలకాలము నుండి దున్నికలోలేని అడవులవంటి క్రొత్తప్రదేశములలో పన్నుల నట్లువిధింపవచ్చును గాని వ్యవసాయము బాగుగా నభివృద్ధిజెంది, చాలకాలమునుండి దున్నబడుచున్న పాతభూములపై నట్లు విధించుట న్యాయము గాదు. అందువలననే పూర్వ మనేకదేశములలో పన్నులను విధించునప్పుడు వైశాల్యముతోపాటు భూముల ఫలసంపదకూడ గమనింపబడు చుండెను. పండిన పంటలో కొన్నివంతులు రేనికి జెందునన్న న్యాయము మనదేశమున బహుపురాతనమైనది[1]. గౌతముడు వశిష్ఠుడున్నగు ప్రాచీనస్మృతికర్తలు మొత్తపు

1. "తాన్యుఞ్ఛ షష్ఠాఙ్కిత సైకతాని
శివానివ స్తీర్థజలాని కచ్చిత్."

"మీపఱిగధాన్యములో (ఏఱి 'కోర' యిన) యాఱవపాలియొక్క రాసులుగల విరయునగు మీతీర్థోదకములు భద్రములుగదా?" రఘువంశము. ఆరవసర్గ.

పంటలో ఆరు మొదలు లేనిమిదవవంతువరకును, రాజు గ్రహింపవచ్చునని విధించియుండిరి. పూర్వపు గ్రీకు పారసీక చీనా బర్మా రోమను సామ్రాజ్యములలోగూడ ఫలసాయమును బట్టి పన్నులను విధించుట ఆచారమైయుండెను.

ప్రజల ధనసంపదయును వాణిజ్యవ్యాపారములును అభివృద్ధియగుకొలది భూముల విలువ హెచ్చును. వర్తకవ్యాపారముల కనువుగానుండు భూములయొక్కయు, అట్లుగాని భూములయొక్కయు విలువలో విశేషవ్యత్యాస మేర్పడును. కాబట్టి ఫలసాయమును మాత్రము గణించినయెడల అనేకులకు నష్టము వాటిల్లును. వర్తకపు సౌకర్యము లన్ని భూముల కొక్కచోట్లనే నుండవు. వ్యవసాయపుఖర్చు లన్ని భూముల కొక్కవిధమున నుండవు. నీటివసతు లన్ని భూముల కొక్కరీతిన నుండవు. పనివాం డ్రన్ని భూముల కొక్కరీతిని దొరకరు. మంద మరమ్మతు లన్ని భూముల కొక్కమాదిరి జరుగవు. ఇవి ప్రదేశమునుబట్టి పొలమునుబట్టి రైతునుబట్టి మారుచుండును. పన్నులను విధించునప్పు డిట్టి భేదము లనేకములను గమనింపవలసియుండును.

భూమిపన్ను నీ క్రిందివానిపై విధింపవచ్చును:—

(1) మూలధనముయొక్క విలువపై. ఇది తరచు కొకసారి భూముల అమ్మకపుధరను బట్టి నిర్ణయింపబడుచుండును.

(2) భూమి కర్షకుని వ్యయప్రయాసలవలన నేర్పడిన విలువ పోను మిగిలిన భాగముపై. అనగా భూమికి సమీపముగ రైల్వేస్టేషనులును, సమీపమున నగరములును, వర్తకస్థలములును, వాణిజ్యమున కనుకూలముగ ఇతరవసతులును ఉండుటవలనను ఏర్పడు విలువమీదను.

(3) నికరపుపంటమీదను - అనగా మొత్తపుపంటలో వ్యవసాయపుఖర్చులు పోను మిగతభాగముమీదను.

(4) సాలుసరి విలువమీదను—అనగా మొత్తపుపంటలో వ్యవసాయపు ఖర్చులను పనిచేయించిన వాని వేతనమును పోగా మిగిలిన భాగముమీదను.

(5) కర్షకుని నికరాదాయముమీదను—అనగా పనిచేయించినందుకును, (కర్షకుడును ఆతనికుటుంబమును) పనిచేసినందుకును ప్రతిఫలముగ లభించు భాగముమీదను.

నేడు ప్రపంచమునందు వివిధదేశములలో నీపద్ధతు లెట్లు అమలులోనున్నదియు డాక్టరు జాకబ్సన్ గారిచే నిట్లు వర్ణింపబడెను:—

ఐరోపాఖండమున కొన్ని దేశములలో భూమిపన్నును పూర్తిగా రద్దుచేసి అందుకు బదులు భూమినుండి లభించెడు ఆదాయముపై ఇతర ఆదాయములపై వలెనే పన్నులను విధించుటగలదు. ఫిన్లండుదేశమున 1924 సంవత్సరమునం దిట్టి సంస్కరణము గావింపబడెను. కాని ఫ్రాంసు జర్మనీ మొదలగు దేశములలో భూమిపన్నుయొక్క ప్రాముఖ్య మింకను పోలేదు కాని భూమిపై విధింపబడునది భూమిపన్ను మాత్రమేగాదు. అనేక దేశములలో భూస్వామి భూమిపన్నుతో బాటు సాధారణమైన ఆదాయపు పన్నునుగూడ

చెల్లింపవలసి యున్నది. మరియును ఆదాయపుపన్ను క్రమముగ హెచ్చుచున్నది. అందుకు తోడు మునిసిపాలిటీలు మొదలగు స్థానికసంఘములు విధించు పన్నులుగూడ కలవు.

భూమిపన్ను సామాన్యముగా ఎన్నడో తయారుచేయబడిన పాతలెక్కలనుబట్టి విధింపబడుచుండుటవలన దానికిని నేటికాలపు స్థితిగతులకును ఎట్టిసంబంధమును లేదు. తాను భూమిపన్ను పేరను ఆదాయపుపన్ను పేరను రెండుతడవలు పన్నియ్యవలసి వచ్చుచున్నదని భూస్వామి పోరాడుచున్నాడు. భూమిపన్ను బహుస్వల్పమనియును, భూస్వామి చెల్లింప నక్కరలేని వృత్తిపన్ను మొదలగు అనేకపన్నులను తాను చెల్లింపవలసి వచ్చుచున్నదనియును నగరవాసి పోరాడుచున్నాడు.

ఫ్రాంసు దేశము:—ఫ్రాంసు దేశమున భూమిపన్ను 1914 సంవత్సరము వరకును నికరపుపంటపై—అనగా వ్యవసాయపు ఖర్చులును, కర్షకుని కుటుంబమును పోషించుటకగు వ్యయమునుపోగా మిగిలిన భాగముపై విధింపబడుచుండెను. అది 1807 మొదలు 1850 వరకు జరుపబడిన భూమికొలతలపై నాధారపడియుండెను. కాని ఆలెక్కలు పాతబడుట వలన 1907-1914 సంవత్సరములలో ఆపద్ధతిని పూర్తిగా మార్చివేసి పన్నుమొత్తము సాలుసరి ఆదాయ మంతటిపై ఒక్కరేటున విధించిరి. ఆరేటు 1914 సంIIన నూటికి 4 వంతులుగను, 1917-వ సంIIన 5 వంతులుగను, 1920 సంIIన 10 వంతులుగను ఉండెను. నేలయొక్క ఉపయోగము, సాగము, పంటలు, ఉనికిపట్టు మొదలగు స్థితిగతులనుబట్టి భూమినంతను వేర్వేరు తరగతులుగ విభజించిరి. భూమిపన్ను కౌలుదారు భూస్వామికి చెల్లించు శిస్తుమొత్తమునుబట్టి విధింపబడుచున్నది. భూమినుండి లభించు ఆదాయముపై సామాన్యపు ఆదాయపు పన్నుగూడ కలదు.

ఇటలీ:—ఇటలి దేశములో భూమి రెండు విధములైన పన్నులను చెల్లింప వలసి యున్నది:—

(1) నూటికి 10 వంతులు చొప్పున భూమియొక్క ఆదాయమంతటిపై సమాన రేటున విధింపబడు ఆదాయపు పన్ను.

(2) భూమిని దున్ను కర్షకుని ఆదాయముపై నూటికి 18 పాళ్లు చొప్పున విధింపబడు భూమి పన్ను.

భూమి కౌలు కీయబడిన యెడల భూస్వామి మొదటిపన్నును, సేద్యదారు రెండవ పన్నును చెల్లింతురు. సాలుకు 60 రూపాయలకు (436 లైర్లు) తక్కువ ఆదాయములపై ఎట్టి పన్నులును లేవు.

ఇవిగాక స్థానిక వ్యయములకొరకుగూడ కొన్ని పన్నులు విధింపబడుచున్నవి.

హంగెరీ:-హంగెరీలో భూమిపన్ను చాలకాలమునకు పూర్వము తయారుచేయబడిన లెక్కలనుబట్టి నూటికి 25 పాళ్లుచొప్పున విధింపబడుచున్నది. అవి లెక్కలలో నమోదుకాబడిన ఆదాయమునుబట్టి నూటికి 25 పాళ్లు ఐనను, ప్రస్తుతపు ఆదాయమునందు 8 మొదలు 12 పాళ్లవరకు తేలుచున్నది.

ఇదిగాక:—

(1) ఆదాయమునుబట్టి నూటికి 1 పాలు మొదలు 40 పాళ్లవరకు వ్యవసాయపు టాదాయములపై ఆదాయపుపన్ను.

(2) నికరాదాయమునందు నూటికి 1 పాలు మొదలు 20 పాళ్ల వరకు మూలధనపు పన్ను.

(3) కొన్ని స్థానికపు పన్నులును కలవు.

ఆస్ట్రియా:—ఆస్ట్రియా లో భూమిపన్ను పాతలెక్కలనుబట్టి నూటికి 26⅔ పాళ్లు చొప్పున, అనగా ప్రస్తుతపు నికరాదాయమునందు 10 మొదలు 15 పాళ్ల వరకు గ్రహింపబడుచున్నది. యుద్ధమునకు పిదప నిది ప్రత్యేకముగా స్థానికపు పన్నైనది. ఇదిగాక భూమిపై సాధారణమైన రాబడిపన్ను గూడ గలదు.

స్వీడను:- స్వీడను దేశమున కడచిన శతాబ్దాంత భాగమున భూమిపన్ను రద్దు చేయబడుట వలన ఆదాయపుపన్నే నేడుమిగిలినది. అది భూమినుండి లభించు ఆదాయములపై గూడ విధింపబడుచున్నది. ఆదిగాక భూమిపై స్థానికపు పన్నుగూడ కలదు. మఱియును భూమియొక్క విలువపై ప్రత్యేకముగా పన్నును విధించుట కాలోచనలు జరుగుచున్నవి.

ఇంగ్లాండు:- ఇంగ్లాండు దేశమున భూమిపన్నుతో పాటు భూమినుండి లభించు ఆదాయములపై రాబడిపన్ను గూడ విధింపబడుచున్నది. ఇదిగాక స్థానికపుపన్ను గూడ గలదు. స్థానిక వ్యయముల కిదియే ముఖ్యాధారము.

ఆస్ట్రేలియా న్యూజీలాండు దేశములలో భూమిపన్ను భూమియొక్క విలువలో భూమి కామందులయొక్కయు కర్షకుల యొక్కయు వ్యయప్రయాసలకు ప్రతిఫలముగా లభించు భాగముపై గాక దానికి సహజమగు సారము, సత్తువ మొదలగు ప్రకృతి సంపదకు ప్రతిఫలముగా లభించు భాగము పైవిధింపబడుచున్నది.

ఆస్ట్రేలియా దేశమునందనేక రాష్ట్రములలో ఆదాయమునందు కొంతభాగమును తప్పించి మిగిలిన దానిపై పన్నును విధించుచున్నారు. తమభూములను స్వయముగా దున్నక కౌలుకిచ్చు భూస్వాముల విషయమున నట్లు తప్పించుటయులేదు. అట్టి భూస్వాములపై వారు భూమిని కౌలుకిచ్చినందుకుగాను కొన్నిరాష్ట్రములలో కొన్ని ప్రత్యేకపు పన్నులుగూడ కలవు.

న్యూజీలాండు దేశమున 500 పౌనులకు లోపు విలువగల భూములను దున్ను చిన్న చిన్న సేద్యదారులపై భూమిపన్ను లేదు. అంతకు అధికమగు విలువగల భూములపై పౌను వక్కంటికి 1/16 పెన్నీ మొదలు 8 పెన్నులవరకు విలువనుబట్టి హెచ్చుచుండునట్టి రేటున పన్నులు విధింపబడుచున్నవి. పన్నులరేటులో నీ హెచ్చు తగ్గులను రద్దు చేయవలెనని ఈ మధ్య నొకకమిటీవారు సూచించియుండిరి.

ఈరెండుదేశములలోను భూమిపన్నుతోపాటు రాబడి పన్నుకూడ విధింపబడుచున్నది.

చీనాదేశము:—చీనాదేశమున భూమిపన్నులో కొంతభాగము ద్రవ్యరూపముననుకొంతపంటల రూపముననుగ్రహింపబడుచున్నది. భూమికొలతలుగాని పన్నులను చెల్లింపవలసిన వారి జాపితాలుగాని లేనందున అనేక భూస్వాములు పన్నులను చెల్లింపకుండ తప్పించుకొనుచున్నట్లు తెలియుచున్నది.

జపాను:—జపానుదేశమున భూమిపన్ను కాపురముండు స్థలముపై నూటికి 2½ పాళ్లు చొప్పునను, సేద్యముచేయబడు భూమిపై 4½ పాళ్లు చొప్పునను, ఇతరభూములపై 5½ పాళ్లు చొప్పునను విధింపబడుచున్నది. కాని ఈసంఖ్యలను నమ్ముటకు వీలులేదు. భూమిలెక్కలు చాలపాతబడి పోయినవి. 1925 సంవత్సరమున బజారులలోని ధాన్యపుధర పన్నులను విధించుటకు వేయబడు అంచనాకన్న 19 రెట్లు హెచ్చుగా నుండెనని మదింపు వేయబడెను. భూమిపన్నుతోపాటు వ్యవసాయపుటాదాయములపై రాబడిపన్ను గూడ కలదు.

ఇంతవరకు వర్ణింపబడిన విధానములలో భూమిపన్ను ఈక్రిందివిధముల విధింపబడుచున్నట్లు తెలియుచున్నది.

(1) మొత్తపు విలువపైగాని లేక సాలుసరి పంటయొక్క విలువపైగాని సమాన రేటున పన్ను.

(2) ఇతర ఆదాయములతోపాటు భూమినుండి లభించెడు ఆదాయముపైగూడ, ఆదాయముతో రేటుకూడ హెచ్చుపద్ధతిని, ఆదాయపుపన్ను.

(3) కొన్నిదేశములందు చావు(వారసత్వపు)పన్ను, మరికొన్నిదేశములందు మొత్తపు విలువపై మఱొకపేర విధింపబడుపన్ను- మరికొన్నిటిలో ఈరెండును.

(4) ఈమూడునుగాక స్థానిక వ్యయములకొరకు విధింపబడుపన్ను.

ఇందు నేటికాలమున జరుగుచున్న మార్పులీక్రిందిధోరణి నున్నవి.

(1) మొదట జెప్పబడిన సమానరేటు మిక్కిలి స్వల్పముగానున్నది. అసలు భూమిపన్ను ఫ్రాంసుదేశమునందు సాలుసరి పంటవిలువలో పదవవంతు ; ఇటలీదేశమున అర్థిక శేషమునందు పదవవంతు ; హంగేరీదేశమునందు దొరతనమువారి లెక్కలలో నమోదుకాబడిన పంటమొత్తములో నూటికి 8 మొదలు 12 వంతులు; జపానుదేశమునందు మొత్తపు విలువలో సుమారు (నూటికి) 1/4 వంతు.

(2) ఆదాయపు పన్నును చావుపన్నును విధించుటలో భూవసతియు అందుండి లభించెడు ఆదాయమును ఇతర ఆదాయములవలెనే పరిగణింప బడుచున్నవి. స్థిరాస్తి అని గాని మరియెందులకుగాని వానికెట్టి ప్రత్యేకతయులేదు.

(3) భూమిపన్ను అధికముగా గ్రహింపబడుచోట్ల అది సాధారణముగా స్థానిక వ్యయములకొరకని తెలియుచున్నది. ఆస్ట్రియాలో నీపన్ను కొద్దికాలముక్రితము పూర్తిగా

స్థానికము గావింపబడినది. ప్రష్యాలో నీపన్ను 1898 మొదలు 1928 వరకు ప్రత్యేకము స్థానికవ్యయములకొరకే విధింపబడుచుండెను. 1928 సంII పు చట్టముప్రకారము సైతము సామ్రాజ్యవ్యయముకొరకు పన్నువిధింపబడు మొత్తముకన్న స్థానికవ్యయములకొరకు విధింపబడుపన్ను మొత్తము రెండింతలు—ఇటలీలో ఆర్థికశేషమునందు (నూటికి) 15 పాళ్లు ప్రత్యేకము స్థానికవ్యయములకొరకు గ్రహింపబడుచున్నవి. ఇంగ్లాండులో భూమిపన్ను స్థానికము. కాబట్టి (స్థానికపుపన్నులు, ఆదాయపుపన్ను మొదలగు ఇతరపన్నులుగూడ భూమి నుండి లభించెడు ఆదాయములపై బడుటవలన) ఇతర విధములగు ఆదాయములపై కన్న భూమినుండి లభించు ఆదాయములపై పన్నులభారము మధికమగుచున్నది.

భూమిపన్నునుగూర్చి విఖ్యాత అర్థశాస్త్రజ్ఞుడైన పియర్సను పండితు డిట్లు వ్రాయుచున్నాడు.

"భూమిమీదను అందలి ఫలసాయముమీదను భూస్వామికి గల హక్కును గాపాడినందుకు ప్రభుత్వము అతనివద్ద నుండి కొంతద్రవ్యమును గ్రహించుచున్నది. అదియే భూమిపన్ను. ఆపన్ను ఎల్లప్పుడు భూమిని అందుపైగల సంప్రాప్తమైన హక్కును అనుసరించియుండును. అందువలన చేతులు మారినప్పుడు వానితోపాటు పన్నుగూడ చేతులుమారును. భూమిని కొనువాడు భూమితో పాటు ఆపన్నును చెల్లించు బాధ్యతనుగూడ గ్రహించుచున్నాడు. అందువలన అతనికి ఆభూమినుండి లభించెడు ఆదాయములో అంత మొత్తము తగ్గిపోవుచుండును. ఈ హక్కులు కాపాడబడినందుకు ప్రతిఫలముగా అత డామొత్తమును ప్రభుత్వమునకు చెల్లించుచున్నాడు..........వ్యవసాయపు ఖర్చులను, కర్షకునికి న్యాయముగ రావలసిన ప్రతిఫలమును పోగా మిగిలిన లాభముపైన మాత్రము పన్నును విధింపవలెను. ఆ లాభముపైనే నొక్కి చెప్పవలసియుండెను. మరియును పన్నును విధించుటకు లాభమునందలి మొత్తమును తెలిసికొనుటకొకసారి నిర్ణయించు మార్గమలెను కాని ఎప్పుడో నిర్ణయించబడిన మొత్తమునుబట్టి తదుపరిపన్నులను హెచ్చించుచుండరాదు."[1]

## మన భూమిపన్ను

మన భూమిపన్నుకు సంబంధించిన సమస్యలనుగూర్చి జరిగిన తీవ్రవివాదములు హిందూదేశార్థశాస్త్రమునకు సంబంధించిన ఏవిషయమునుగూర్చియును జరిగియుండలేదని చెప్పిన తప్పులేదు. అవి యింకను జరుగుచున్నవి. ముందైనను త్వరలో ముగియుననుట ఆశలేదు. అందు మొత్తము మీద ప్రభుత్వపు పక్షమునొకటియును, ప్రజానాయకుల పక్షమొకటియును రెండుపక్షములేర్పడినవి. ఇరుపక్షములలోని అధికారులును, మహాశయులును చిరకాలమునుండి వాగ్యుద్ధములను జరుపుచున్నారు. వారివాదము లనుబంధములలో దగుల్కొనియున్న మనము కొన్నిసందర్భములలో నిజానిజములను గుర్తింపజాలకున్నాము. అంతేకాదు. భూమి

1. Principles of Economics Pierson, Vol. II.

పన్నునుగూర్చి మనమేమి చెప్పదలచుకొన్నను ఈ రెండుపక్షములవారిలో నెవరికో యొకరికి కోపము రాకమానదు.

మన మాసమస్యలనుగూర్చి తర్కించుటకుముందు ప్రస్తుత మమలులోనున్న ఫైసలా విధానములనుగూర్చి కొంచెము తెలిసికొనవలసియున్నది.

మన దేశమున వివిధప్రాంతములందు వివిధమైన పద్ధతు లమలులోనున్నవి. అవి యొక్కనాటివిగావు. ఒక్కవిధమున అభివృద్ధిజెందినవిగావు. ఆయాప్రదేశములలో వాడుకలోనుండిన పూర్వపుపద్ధతులు అప్పటిస్థితిగతులకు సరిపడునట్లు, అప్పటియుద్యోగులు వానిని గ్రహించిన విధమునుబట్టి ఆంగ్లేయ పాలకులచేతులలో నేటిరూపమును దాల్చినవి. కావున వాని నొక్కపేర బిల్చుటకుగాని ఒక్కవిధమున వర్ణించుటకుగాని వీలులేదు. కొన్నిప్రదేశములకు మాత్రమే అనుకూలమైన సంగతి సందర్భములను దేశమున కంతకును వర్తింపజేయుటకు ప్రయత్నించుటయు, కొన్నివిధములైన అనేకపు పద్ధతులనుగూర్చి తీర్మానించుటలో వానితో ఏమాత్రము సంబంధములేని ఇతరపద్ధతులనుగూడ జేర్చుటయు మన భూమిపన్నునుగూర్చి ఇన్ని తీవ్రవివాదములుండుటకు కారణములని ఎల్ఫిన్‌స్టన్ దొర వ్రాసియుండెను.

ఇక పరిస్థితులలో ఎన్ని భేదములున్నవో చూతుము. ఒక వంక నామకార్థము బహు స్వల్పమొత్తమును కప్పముగాగట్టు పెద్దజమీందారు. ఇంకొకవంక పండిన పంట నాతనుపన్నులపేర ప్రభుత్వమున కర్పించి కడుపునిండ తినుటకు తిండిలేనిబీదరైతు చెల్లింపవలసిన మొత్తము తరచుతరచుగ మారుచుండుప్రదేశములు కొన్ని; ఎన్నడునుమారని ప్రదేశములు మరికొన్ని. బంగాళారాజధానిలోను మరికొన్ని ఇతరప్రదేశములలోను ప్రభుత్వమునకును సేద్యదారునకును నడుమ జమీందారు, పట్నీదారు, దర్పట్నీదారు, సపట్నీదారు మొదలగు మధ్యవర్తులనేకులుగలరు. బొంబాయి మద్రాసు మొదలగు ప్రదేశములలో రైతుకును ప్రభుత్వమునకును నడుమ మధ్యవర్తులులేరు.

హిందూప్రభుత్వములందు రాజు సామాన్యముగా మొత్తపుపంటలో పన్నెండవవంతు మొదలు ఆరవవంతు వరకును, యుద్ధపు దినములలో నాల్గవవంతును, గ్రహించుచుండెను.[1]

1. షడ్భాగ భూతో రాజా రక్షేత్ప్రజామ్ - బోధాయన ధర్మసూత్రము 1-10.
రాజు ప్రజలవలన నారవవంతును పుచ్చుకొని వారిని రక్షింపవలెను.

రాజ్ఞే బలిదానం కర్షకైర్దశమ మష్టమం షష్ఠం వా గౌతమ ధర్మసూత్రం. (10)

వ్యవసాయదారులు రాజునకు పండినపంటనుండి పదియవ వంతుగాని యెనిమిదవ వంతుగాని ఆరవవంతుగాని పన్నుగా నీయవలెను.

పంచాశద్భాగ ఆదేయో రాజ్ఞా పశు హిరణ్యయోః ధాన్యానా మష్టమో భాగః షష్ఠో ద్వాదశ ఏవవా - మనుస్మృతి 7-130.

పన్నులను ప్రజలలో నొక్కొక్కరి యొద్దనుండిగాక గ్రామములనుండి గ్రహించుచుండిరి. ఒక్కొక్క గ్రామమున కొక్కొక్క నాయకుడుండును. అతడు మొత్తపుపంట నొకరాశిగా పోసి అందు రాజభాగమును వేరుచేసి పిదప ఎవరిభాగమును వారికి బంచియిచ్చును.[1] అతనికిని రాజునకునుమధ్య ఒకగ్రామాధి పతియనియును, దశగ్రామాధి పతియనియును, శతగ్రామాధిపతియనియును, సహస్రగ్రామాధిపతియనియును అనేకఉద్యోగులుండిరి. పన్నులను సరిగా వసూలుచేయు బాధ్యత వారిది. అందుకు ప్రతిఫలముగ వారు పంటభాగమునందొక వంతునుగాని, లేక పన్నియ్య నక్కరలేకుండ కొంతభూమినిగాని అనుభవించు చుండిరి.

మహమ్మదీయుల కాలమున పన్నులు హెచ్చెను. మరియును అందు అంతనుగాని కొంతనుగాని ధనరూపమున గ్రహించుటకు ప్రయత్నములు జరిగెను. ఈవిషయమై తైమూర్ శాసనములలో మొదటిప్రయత్నము చేయబడెను. తరువాత ప్రయత్నించినది షర్ షా (1540-55). కాని అతను చిరకాలము రాజ్యము చేయనందున తనయుద్దేశ్యముల నమలులో పెట్టుటకు అతనికి వీలులేకపోయెను. జగద్విఖ్యాతమైన మూడవప్రయత్నము అక్బరు చక్రవర్తికాలమున రాజా తోడరు మల్లుచే గావింపబడెను.

అతడు భూములన్నిటిని కొలిపించి వానిని సారమునుబట్టి నాలుగు తరగతులుగ భాగించెను. మొత్తపుపంటలో మూడవవంతును పన్నుగా నిర్ణయించి, ఆవంతును కడచిన పందొమ్మిదేండ్ల ధరలనుబట్టి ద్రవ్యములోనికి మార్చెను. మొదట ఏయేటి పంటలనుబట్టి ఆయేడు పన్ను మొత్తము నిర్ణయింపబడుచుండెను. కాని ఏటేట పన్నులను నిర్ణయించు చుండుట ప్రయాసకరమగుటవలన పదియేండ్ల దామాషాయినిబట్టి ఫైసలాలు జరుపబడుచుండెను. అందువలన ప్రభుత్వమునకును పన్నిచ్చువారికినిమధ్య అనేకమంది ఉద్యోగస్థులను నియమింపవలసి వచ్చెను. అట్లు నియమింపబడిన వారిలో నొకడు "జమీందారు". ఇప్పటి అర్థమున "జమీందారు" పూర్వపు హిందూప్రభుత్వములం దగపడదు. పూర్వము పన్ను

పశువులు బంగారము వీనివలన వచ్చినలాభములో ఏబదియవ వంతును ధాన్యములు పండు భూములపైని భూముల సారాసారములకు దగినట్లు ఎనిమిదికాని, ఆరుకాని, పన్నెండు కాని వంతులలో నొకవంతును రాజు గ్రహింప వలెను.

అనాదేయం నాదదీత పరిక్షీణోపి పార్థివః - మనుస్మృతి 8-170

ద్రవ్యహీనుడుగా నుండినను రాజు మామూలుకన్న హెచ్చుగా ప్రజలవలన గ్రహింప రాదు.

అరక్షితారం రాజానం బలిషడ్భాగ హారిణం తమాహుస్సర్వలోకస్య సమగ్రమల హారకమ్ - మనుస్మృతి 8-308.

ఆరవవంతు భూమిపన్నును దీసికొనుచు నేరాజు ప్రజాపాలనమును యుక్తముగ జేయడో ఆప్రజల పాపము నంతటిని ఆరాజు పొందును.

1. India Encyclopedia Britannica.

లను వసూలుచేయుట మాత్రమే అతనిపని. రాజా తోడరుమల్లుయొక్క పద్ధతి ఇంచుమిం చుగా నూరేండ్లకాల మే మార్పులును లేకుండ అమలులోనుండెను. కాని క్రమముగ ఢిల్లీ సార్వభౌముల ప్రతిభయంతరించి, స్థానిక ప్రభువుల ప్రభ హెచ్చుకొలది వారనేక క్రొత్త పన్నులను విధింపజొచ్చిరి.

తూర్పు ఇండియా సంఘమువారు బంగాళము బిహారు ఒరిస్సారాష్ట్రముల పరిపాల నమును ప్రారంభించునప్పటి స్థితిగతు లిట్లుండెను. మొదట వారును అప్పుడమలులోనున్న పద్ధతులను పన్నులను వసూలుచేయుటకు ప్రయత్నించిరి. కాని ఆ ప్రయత్నములు నిష్ఫలమ య్యెను. తరువాత అనగా 1793 సం॥న కారన్ వాలీసు ప్రభువుయొక్క శిఫారసువలన శాశ్వతపు ఫైసలా జరిగెను. ఆ ఫైసలాయొక్క ముఖ్యలక్షణము లేమనగా:—

(1) ఆయా ప్రదేశములలో పన్నులను వసూలుచేయుచున్న జమీందారులతో ఫైసలా జరిగెను. జమీందారులకు తమ భూములను అభివృద్ధి పరచుకొనుటకు తగిన ప్రోత్సా హముండుటకై వారి కాప్రదేశములపై ప్రొప్రయిటరీ హక్కు లొసంగబడెను. అందుకు ప్రతిఫలముగ వారేటేట దొరతనమువారి పన్నులను సరిగా చెల్లింపు చుండవలెను. లేని యెడల వారిభూములు వేలము వేయబడును. మరియును జమీందారుల యొద్దనుండి భూముల ననుభవించు తాలుక్దారుల యొక్కయు రైతులయొక్కయు సంరక్షణముకొరకు అవుసర మైన చట్టములను గావించి అమలులో బెట్టు అధికారముకూడ ప్రభుత్వమున కుండెను.

(2) జమీందారులు చెల్లింపవలసిన మొత్తమును ఎన్నడును హెచ్చింపమని దొరత నము వాక్కొనిరి. పాడిపంటలు హెచ్చుటవలనగాని మరి ఇతర కారణముల వలనగాని ఇకముందు భూములవిలువ హెచ్చినను జమీందారులును వారి సంతతివారును అంతకన్న హెచ్చుమొత్తము చెల్లింప నక్కరలేదనిరి. కాని స్థానికవ్యయములకొరకు ఆప్రదేశములపై కొన్ని ప్రత్యేకపు పన్నులను విధించు అధికారము ప్రభుత్వమునకు గలదు. అట్లు వసూ లైన మొత్తమునందు జమీందారుల కేమాత్రమును చెందదు.

(3) జమీందారులు రైతులయొద్దనుండి వసూలుచేయు శిస్తు మొత్తమునందు 11 పాళ్లలో 10 పాళ్లు దొరతనమువారి పన్నుభాగము అనియును 1 పాలు పన్నులను వసూలు చేయు జమీందారులకు ప్రతిఫలమనియును నిర్ణయింపబడెను. దేశమునందు సుస్థిరమైన ప్రభుత్వ మేర్పడియుండనందున వ్యవసాయము సరిగా సాగక ఈ పంపకము మొదటి రోజులలో చాలదుర్భరమై అనేక జమీందారీలు వేలమునకువచ్చెను. కాని క్రమముగ సుస్థిర మైన ప్రభుత్వమేర్పడి భూములవిలువ హెచ్చుకొలది ఆదాయమునకును పన్ను మొత్త మునకును ఎట్టి సంబంధమును లేకుండపోయి భూములవిలువ బహుస్వల్పముగానున్న రోజు లలో వానిపై శాశ్వతముగా పన్నులను విధించుట అన్యాయమని స్పష్టమయ్యెను.

బొంబాయి రాజధానియందంతటను, మద్రాసు రాజధానియందు విశేషభాగము నందును, బర్మా అస్సాము సింధురాష్ట్రములలోను అమలులోనున్న పద్ధతికి రైతువారీ పద్ధతి యనిపేరు. కర్ణాటకము బ్రిటిషువారికి స్వాధీనమైన పిదప ఆప్రదేశమునందుండి

పన్నుల కట్టుబడి వసూలు చేయవలెనని చర్చలుజరిగెను. పన్నులేకేటట సరిగా వసూలుఅగుటయే తూర్పుఇండియా సంఘమువారికి కావలసినది. అందువలన వారు బంగాళారాజధానియం దమలులోనున్న శాశ్వతవిధానము నిచ్చటకూడ అమలులో బెట్టవలయునని మద్రాసు ప్రభుత్వమునకు వ్రాసిరి. కాని మద్రాసు రాజధానియొక్క ఉత్తరదక్షిణములలో దప్ప మిగిలిన చోట్ల ఆప్రయత్నములు వ్యర్థమయ్యెను. తుదకు సర్ థామస్ మన్రోగారి రైతువారీపద్ధతి అమలులో బెట్టబడెను.

ఆపద్ధతిప్రకారము ప్రభుత్వమునకును భూమినిదున్ను రైతుకును నడుమపన్నులను వసూలుచేయు మధ్యవర్తులుండరు. రైతు తనపొలముపై విధింపబడిన పన్నుమొత్తమును స్వయముగా ప్రభుత్వమునకు చెల్లించును. కాని పన్నులు రైతును బట్టిగాక పొలమునుబట్టి విధింపబడుటవలన దీనిని పొలమువారీపద్ధతియని పిలువవచ్చును. పొలముపై దానవిక్రయాధికారములు రైతునకొసంగబడెను. మరియును రైతు ఆపొలమును వంశపారంపర్యముగ అనుభవింపవచ్చును. శాశ్వతపు సెటిల్మెంటునందలి జమీందారువలెనే రైతును సెటిల్మెంటు కాలమునందు నిర్ణయింపబడిన మొత్తమును దొరతనమువారికి సకాలమునకు చెల్లింపవలెను భూమి ననుభవించువాడే పన్నుకట్టుటకు బాధ్యుడు. మరియు నతడు ఆభూమిపై మరికొన్ని స్థానికపు పన్నులనుకూడ చెల్లించవలసియుండును.

గ్రామపద్ధతి లేక మహాల్వారిపద్ధతి:— ఇది పంజాబుసంయుక్తపరగణాలలో వాడుకలోనున్నది. ఈపద్ధతిప్రకారము గ్రామమునుండి వసూలు కావలసినమొత్తమునకు గ్రామస్థులందరును జవాబుదారులైయుందురు. వారే గ్రామములో సాగుచేయబడు ప్రతి పొలమునకును ఇంతేసిపన్ను చెల్లింపవలయునని నిర్ణయించుకొందురు. గ్రామపంచాయతీలు నిర్ణయించిన పన్నుమొత్తము సరిగానున్నదియు లేనిదియు ప్రభుత్వపు సెటిల్మెంటు ఉద్యోగులు కనిపెట్టుచుందురు. ఇందుతోపాటు భూమినుండి కొన్ని స్థానికపుపన్నులు గూడ వసూలుచేయబడుచున్నవి.

ఆయాప్రాంతములలో దొరతనమువారు తాలుకాదార్లతో వ్యవహరించుచుందురు. "తాలూకుదారులు సర్కారుకు చెల్లవలసిన యాపత్తుపైకము వసూలుచేసి, వసూలు చేయుట కగుఖర్చులను, తాము శ్రమపడి పనిచేసినందులకును, జీవయాత్ర గడచుటకును, తమ గౌరవమును కాపాడుకొనుటకు దయచేయబడిన సొమ్మును మినహాయించుటకు హక్కుకలదు. తాలూకుదారునకును జమీందారునకును విశేషభేదముగలదు. తాలూకుదారులు ముస్తాజరులను బోలియుందురు. ముస్తాజరులు తాము చెల్లించెదమని ఒప్పుకొన్న పైకమును ఖామందులకు చెల్లించి శేషమును తమ లాభముగ గ్రహించుచుందురు. ముస్తాజరులకు ఒకటిరెండు సంవత్సరములలో మగతా విధింపబడియుండును. తాలూకుదారులవలె ఇరువది ముప్పది సంవత్సరముల వరకు వ్యవహరింపవీలులేదు. జమీందారులకువలె తాలూకుదార్లకు భూములయందు శాశ్వతహక్కులేదు."1

1. హిందూదేశ అర్థశాస్త్రము. శారదాపబ్లిషింగు కంపెనివారిది. పుట 119.

భూమిపైసలా పంజాబు మధ్యపరగణాలలో 20 ఏండ్ల కొకసారియును, మద్రాసు బొంబాయి పశ్చిమోత్తర పరగణాలలో 30 ఏండ్ల కొకసారియును జరుగును. పైసలా కాలములలో నిట్టి భేదములుండుటను గూర్చి దొరతనమువారిచే ప్రకటింపబడిన "భూమి శిస్తుపద్ధతి" యందిట్లు వ్రాయబడియున్నది:—"ఇట్టి భేదములకు గల కారణము స్పష్టము. భూమి బాగుగా సాగుచేయబడి, శిస్తులు న్యాయముగానుండి, పంటలేకేటట సరిగానున్న ప్రదేశములలో ముప్పదియేండ్ల కొకసారి- అనగా తరమున కొకసారి- పన్నులను మార్చిన జాలును. అట్లుగాక బీడుబడిన భూమి విశేషముగానుండి, కౌలుశిస్తులు బహుస్వల్పములై పంటలు సరిగా పండని ప్రదేశములలోను, రోడ్లు కాలువలుఇనుపదారులు నగరములు సమీపములో నతి త్వరితముగ యభివృద్ధి జెందుచు స్థితిగతు లతిశీఘ్రముగా మారుచుండు ప్రదేశములలోను చాలకాలమువరకు పన్నులను మార్పకుండుట యన్యాయము."[1]

## భూస్వామియెవ్వరు? ప్రభుత్వము వసూలుచేయునది పన్నా? శిస్తా?

మన భూమిపన్నుకు సంబంధించిన సమస్యలలో నిది యొకటి. ఇందును రెండు పక్షము లున్నవి. భూమి సేద్యగానిదనియును, అతడు దొరతనము వారికి చెల్లించునది పన్ను అనియును సేద్యగాని పక్షమువారు చెప్పుచున్నారు. భూమి యంతయును ప్రభుత్వముయొక్క స్వంత యాస్తియనియును, దానిని దున్నుకొన నిచ్చినందులకై రైతు ప్రభుత్వమునకు చెల్లించునది భూస్వామికి కౌలుదారు చెల్లించు శిస్తుఅనియును ప్రభుత్వ పక్షవాదము.

ప్రభుత్వపు పక్షమును కొంతకాలమునకు ముందు మద్రాసు విశ్వవిద్యాలయమునందు అర్థశాస్త్రపు పండితుడుగా నుండిన గిల్బర్టు స్లేటరుదొర ఇట్లు సమర్థించియున్నాడు. "న్యాయమును బట్టిచూచినను, న్యాయశాస్త్రమును బట్టిచూచినను పట్టాదారు ప్రత్యేకమైన భూస్వామియని చెప్పుటకు వీలులేదు. బ్రిటిషు ప్రభుత్వమును, తత్పూర్వపు ప్రభుత్వములును రైతుకు కొన్నిహక్కుల నిచ్చినమాట నిజమే. బ్రిటిషు ప్రభుత్వమునకు పూర్వమీ హక్కుదొరల బారినుండియును దొంగలబారి నుండియును దాముకొన గలిగినంతమట్టుకు తినుట, లేనప్పు డుపవాసముండుటగా నుండెను. అక్బరు చక్రవర్తికాలమున ప్రభుత్వము మొత్తపు ఫలసాయములో మూడవవంతును అవసరమునుబట్టి అంతకు హెచ్చుగను గ్రహించుచుండెను. మహమ్మదీయ దండయాత్రలకు పూర్వము ప్రభుత్వము సామాన్యముగ నారవ వంతును యుద్ధసమయములందు నాల్గవవంతును గ్రహించుచుండిన ట్లగపడును. యథార్థముగ నింతే గ్రహించుచుండెనో లేక అధికముగ గ్రహించుచుండెనో తెలిసికొనుటకు తగిన సాధనములు లేవు. కాని దేశమునకు వాటిల్లెడు ఉపద్రవములను కొరతలను నివారించునది గావున ప్రభుత్వము వ్యవసాయదారునితో బాటు భూమిలో నొక భాగస్వామి

1. భూమిశిస్తుపద్ధతి.

యనియును, తనహక్కును తానే త్యజించినప్పుడుతప్ప తక్కినచోట్ల ఆహక్కు భాగము యొక్క విస్తీర్ణమును నిశ్చయింపగల అధికారము అనాది నుండియును ప్రభుత్వమునకే ఉండెననియును నిస్సందేహముగ చెప్పవచ్చును."[1] రెండవపక్షమును పూనాకాలేజీలో నర్థశాస్త్రపండితుడైన వామన గోవిందకాళే తన హిందూదేశార్థ శాస్త్రమునం దిట్లు సమర్థించియున్నాడు. "భూమిలో పండు ఫలసాయములో మాకుకూడ కొంతహక్కు గలదనియును మేముకూడ భూస్వాములలో నొకరమనియును ప్రభుత్వమువారు చేయువాదమును మేమంగీకరింపము. అట్లైనయెడల భూమినుండి లభించు ఆర్థికశిస్తును(Economic Rant) వారి కర్పింపవలసియుండును. న్యాయమును అనుసరించి ఆర్థికశిస్తు భూస్వామికి చెందవలెను. అనగా భూమిని దున్నువానికి చెందవలెను. పూర్వపురాజులు భూమిపై పన్నును విధించుచుండిన మాటనిజమేకాని మేమే భూస్వాములమని వారెన్నడును వాదించి యుండలేదు. మొత్తపు పంటలో నారవవంతో ఎనిమిదవవంతో ద్రవ్యరూపముననుగాక వస్తురూపమున వారుగ్రహించుచుండిరి. పండిన పంటలో నొకభాగమును గ్రహించుచుండిరి. ఇప్పుడా "పండినదానిలో నొకవంతు" అనుపద్ధతిబోయి పంటలెట్లున్నను ధరలెట్లున్నను ధనరూపమున ఇంతమొత్తమును ఇచ్చి తీరవలెను అనుపద్ధతి ఏర్పడుటవలన సేద్యగానికి అపరిమితమైన కష్టనష్టములు గలుగుచున్నవి. జాన్ క్రైర్డువంటి దయార్ద్రహృదయులు పూర్వపు పద్ధతియే యుక్తమని వ్రాసియుండిరి."[2]

ఇరుపక్షముల వారును తమతమ వాదములను బలపరచుకొనుటకై ప్రాతగ్రంథములను తిరుగవేసిరి. గౌతమస్మృతి, మనుస్మృతి, కౌటిల్యుని అర్థశాస్త్రము, మహాభాగవతము, అయానీఆక్బారీ, తూర్పుఇండియా సంఘమువారి రిపోర్టులు మొదలగుగ్రంథముల సహాయమున తమతమవాదములను సమర్థించుటకు ప్రయత్నించిరి. దొరతనమువారు కొంతసేపు వాగ్యుద్ధమునునడిపి తుదకు విసిగి ఇకముందీ విషయమునుగూర్చి యోచింపబోమనిరి. ప్రజానాయకులకు శిస్తువాదమునందు గొప్ప అభిమానము కలదు. 1921 సం॥న మద్రాసులో జరిగిన మొదటి మద్రాసు రైతువారీ భూస్వాముల సభావేశమున అగ్రాసనత వహించిన శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డి, ఎమ్. ఏ. (కాంటాబ్) గారు తమ అగ్రాసనోపన్యాసము నందిట్లు చెప్పియుండిరి.

"ఈశిస్తుసిద్ధాంతము తడవకొకసారి పన్నులను హెచ్చించుటకును, వసూలుకాబడిన మొత్తము ప్రజలబాగుకొరకు వెచ్చింపవలసిన బాధ్యత ప్రభుత్వమునకు లేదని చూపుటకొరకును తేబడినదని నాకుతోచుచున్నది. ఈసిద్ధాంతము ప్రకారము భూమినుండి లభించెడి యాదాయము ప్రభుత్వమువారి స్వంతద్రవ్యము. కాబట్టి భూస్వామికి తానువసూలు చేసికొను శిస్తుపైకమును కాలుదారుని అభివృద్ధికొరకు వెచ్చింపవలసిన బాధ్యతలేనట్లే భూమినుండి లభించు మొత్తమును ప్రజలయభివృద్ధికొరకు వెచ్చింపవలసిన ఆవశ్యకత

1. Some South Indian Villages. University of Madras Economic Series.
2. Kale's Indian Economics

ప్రభుత్వమునకు లేదని స్పష్టమగుచున్నది. ఇదెంత తలతిక్కవాదమో చూపుటకే నేనిప్పుడు మీకీసంగతులను చెప్పుచున్నాను"[1]

ఈసమస్యయందు ఐదుప్రశ్నలిమిడియున్నవి.

(1) హిందూమహమ్మదీయ రాజులకాలమున ఎన్నడైన ప్రభుత్వమునకు భూమిపై ప్రొప్రయిటరీ హక్కు ఉండి యుండెనా ?

(2) ఉండియుండినచో బ్రిటిషుప్రభుత్వమునకట్టి హక్కులేమైన తత్పూర్వపు ప్రభుత్వములనుండి సంక్రమించియుండెనా ?

(3) ప్రస్తుతకాలమున జమీందారీ భూములపైగాని రైతువారీ భూములపైగాని ప్రభుత్వమునకు ప్రొప్రయిటరీ హక్కుగలదా ?

(4) లేనియెడల జమీందారీ భూములపై జమీందారులకును రైతువారీ భూములపై రైతులకును అట్టి హక్కుగలదా ?

(5) మనభూమిపన్ను పన్నా లేక శిస్తా ?

మొదటిరెండు ప్రశ్నలను దేశచరిత్రకు సంబంధించినవి. అవి ఎల్ఫిన్‌స్టనును, విల్సన్ జేడనుపవెలు మున్నగు పండితులచే బాగుగా పరిశోధింపబడినవి. ఆవ్రాతలనన్నిటిని జాగ్రత్తతో పరిశీలించి 1875 వ సం॥ న బొంబాయి హైకోర్టువారొక కేసునందిట్లు తీర్పు జెప్పియుండిరి.

"ఈపండితుల వ్రాతలను పరిశీలించుటవలన ప్రొఫెసరు విల్సనుగారు వచ్చిన తీర్మానమునకే మేమును వచ్చుచున్నాము. అదియేమనగా హిందువుల శాస్త్రములందుగాని ఆచారవ్యవహారములందుగాని ప్రభుత్వమునకు భూమిపై ప్రత్యేకమైన ప్రొప్రయిటరీ హక్కు ఎచ్చటను గానరాదు. ఇతరహక్కులకు తావులేని సంపూర్ణమైన హక్కు ప్రభుత్వమునకుండి యుండెనని ఇప్పటి హిందూధర్మశాస్త్రజ్ఞులుగూడ ఒప్పుకొనరు."

Bombay High Court Reports Vol. XII. P. 1875.

మహమ్మదీయుల ప్రభుత్వమునందాచరణమునందున్న పద్ధతులను సమగ్రముగ పరిశీలించిన కన్నలు గాలోవేగారిట్లు వ్రాయుచున్నారు. "భూమిపై హక్కు ఎంతవరకు సాధ్యమో అంతవరకు సేద్యదారుని కుండెను. తత్సంబంధమైన పన్నులు సరిగా చెల్లుచుండి నంతకాల మతనిని భూమిలోనుండి తొలగించుటకు ధర్మశాస్త్ర మధికారమీయలేదు. రాజనీతి అంగీకరింపలేదు. చెల్లనిచో భూములు జప్తీ చేయబడును. ఇంగ్లాండుదేశపుచట్టముల ప్రకారము అతిశాశ్వతమగు ఫైసలాపద్ధతిని భూముల ననుభవించు ప్రభువులలో నగ్రగణ్యానికతికూడ అంతే.

హిందూదేశపు రైతుకు భూమి ననుభవించుటకు హక్కుగలదు. దానవిక్రయములకు హక్కుగలదు. అతను చెల్లింపవలసిన పన్నురేటును, కొన్ని తావుల పన్నుమొత్తమును,

1. From the Presidential address of Mr. C. R. Reddy, M. A. (Cantab) at the first Madras Ryotwary Landlords' Conference Madras 1921.

నిశ్చయముగా తెలియును. ఇక అతని హక్కు ఇంగ్లీషు భూస్వాముల హక్కున కెట్లు తీసిపోవును?"1

కాబట్టి మనమాలోచింపవలసిన రెండవప్రశ్నలవిషయమై, హిందూమహమ్మదీయ ప్రభువులు భూమిపై తమకు ప్రత్యేకమైన, సంపూర్ణమైన హక్కులు గలవని ఎన్నడును వాదించియుండలేదనియును, ప్రజలచే అంగీకరింపబడియుండలేదనియును 1924-25 సం॥న ఇండియా దొరతనపు పన్నుల కమిటీవారేకగ్రీవముగా నభిప్రాయపడిరి.

ఇక మూడవప్రశ్న విషయమై:—మొగలాయి చక్రవర్తుల ప్రభయంతరించిన పిదప బయలుదేరిన చిన్నచిన్న రాజులు తాము వసూలుచేయు దుర్భరమగు పన్నులను సమర్థించుకొనుటకై భూమియంతయు తమదేయనియును కావున పన్నులను తమచిత్తము వచ్చినట్లు విధింపవచ్చుననియును వాదించుచుండిరని కొందరి యుద్దేశ్యము. ఆకాలమున పన్నులబాధ దుర్భరముగ నుండెనని చెప్పుట కనేక ఆధారములు గలవు గాని భూమియంతయు తమదేయను సిద్ధాంతము ఆరాజులచే చేయబడెనని గాని ప్రజలచే అంగీకరింపబడెననిగాని చెప్పుట కెప్పటను ఆధారములు లేవు. మహారాష్ట్రీపు పరిపాలకుల కాలమున రైతులలో విశేష భాగము దొరతనమువారి పన్నులను సరిగా చెల్లించు షరతుపై తమతమ భూములకు తామే సొంతదారులనియును, ఆయాస్తిపైవారికి వారసత్వపు హక్కును దానవిక్రయముల హక్కును ఉండెననియును, పన్నులను సరిగా చెల్లించునంతకాలము వారు తమభూములలో నుండి తొలగింపబడరనియును, పన్నులను కొంతకాలము, అనగా, అనుమను ముప్పదేండ్ల కాలము, చెల్లింపలేక పోయినను తరువాత బాకీలను తీర్చివేసి తిరిగి తమ భూములను యథాప్రకారముగా అనుభవింపవచ్చుననియును, వారు చెల్లింపవలసిన పన్నుమొత్తము సునిశ్చయముగా నిర్ణయింపబడియుండెననియును మహారాష్ట్రీపు ప్రభుత్వము నంతమొందించిన మిరాసీదారులను గూర్చి నివేదించుటకై నియమింపబడిన మౌంటుస్టువర్టు ఎల్ఫిన్స్టన్ దొరగారు వ్రాసియుండిరి.2

ఇట్లే దక్షిణహిందూస్థానమందుగూడ అతిపురాతనకాలమునుండియును రైతులు తమభూమిపై సంపూర్ణమైన హక్కులుండెననియును భూమియంతయు పృథివీపతికి జెందునన్న సిద్ధాంతమెన్నటను ఎప్పుడును అంగీకరింపబడియుండలేదనియును చూపుట కనేక నిదర్శనములుగలవు. బంగాళారాజధానియందు 1793-వ సం॥న తూర్పుఇండియా సంఘము వారు జమీందారులకు శాశ్వతపు పట్టాల నొసంగుటవలన ఆకాలమున భూమియంతయు ప్రభుత్వమునకు జెందునన్న సిద్ధాంత మంగీకరింపబడియుండెనని కొందరి యుద్దేశ్యము.

ఆవిషయమును ప్రివీ కౌన్సిలు వారిదివరకే నిర్ధారణ చేసియున్నారు. 1828 వ సం॥న ఆసభయొక్క అధ్యక్షులైన లార్డుఛాన్సలరుగారిట్లు వ్రాసియుండిరి. "ఈకాగితములను నాశ్రద్ధనంతయు వినియోగించి పరిశీలించినాను. అందువలన నాకు శాశ్వతపు రిగ్యులేషనులబట్టి

1. Gallowray Law and constitution of India 1825 P. 48.
2. Quoted in the Bombay High Court Report Vol. XII 1875.

గలిగిన (భూస్వామికి శాశ్వతపు ఫైసలాజరుగుటకు పూర్వమే తనభూమిపై శాశ్వతపు హక్కుండెనను) నమ్మకము మరింత దృఢమగుచున్నది."[1] రెండవతీర్పు 1874 వ సంవత్సరమున నొసంగబడినది. ఇదికూడ శాశ్వతపు ఫైసలావలన గలిగిన (భూస్వాముల హక్కునకు వ్యతిరిక్తమగు) అపోహలను తొలగించినది.[2]

## పన్నుల కమిటీ వారి అభిప్రాయము

శాశ్వతపు ఫైసలా జరిగిన ప్రదేశములలో ప్రభుత్వమున కిప్పుడు ప్రొప్రయిటరీ హక్కు లేదనియును, తదితర ప్రదేశములలోని ఖాస్ మహాలు ఎస్టేట్లమీదను బంజరుభూముల మీదను సంపూర్ణమైన హక్కు గలదనియును, కమిటీవా రేకగ్రీవముగ నంగీకరించిరి. రైతు వారీభూములమీదను, తడవకొకసారి ఫైసలా జరుగుచుండు ఇతర భూములమీదను ప్రభుత్వమున కెట్టిహక్కు గలదు అనువిషయమై కమిటీవారి కభిప్రాయభేదములు గలిగెను. పన్నులేకేట సరిగా చెల్లింపబడుచుండు కాలము అట్టి భూములకును శాశ్వతపు ఫైసలా జరిగిన భూములకును విశేషవ్యత్యాసము లేదనియును, ఫైసలా శాశ్వతము గాకపోయినను అట్టి ప్రదేశములలోని రైతులకుకూడ సమభూములపై సంపూర్ణమైన దానవిక్రయాధికారము లున్నవనియును కొందరి యభిప్రాయము. కొన్నిప్రదేశములలో భూమిని వాడు విధమునుబట్టి పన్నులను హెచ్చించుట గలదనియును, మరి కొన్ని ప్రదేశములలో బంజరు భూములను ప్రత్యేకపు షరతులపై కౌలుకుగాని అమ్మకమునకుగాని ఇచ్చివేయు ఆచారము గలదనియును, పంజాబులోను బర్మాలోను క్రొత్తగా సాగుచేయబడు పలుప్రదేశములలోని భూము లట్టివేయనియును, అట్టి సందర్భములలో ప్రభుత్వమునకును రైతుకును మధ్యనుండు సంబంధము భూస్వామికిని కౌలుదారునకును మధ్యనుండు సంబంధము వంటిదే యనియును మరికొందరి యభిప్రాయము.

తడవ కొకసారి ఫైసలా జరుగుప్రదేశమునందలి రైతుల హక్కులనుగూర్చి కమిటీవారేకాభిప్రాయులు గాకపోయినను సామాన్యముగ పన్నులు సరిగా జెల్లునంత కాలము మన రైతులకును జమీందారులకును వారిభూములపై సంపూర్ణమైన ప్రొప్రయిటరీ హక్కు గలదని ఏకగ్రీవముగ నంగీకరింపబడెను.

అమరకపు పద్ధతులనాట యటుంచి భూమినుండి వసూలుచేయబడు ద్రవ్యము పన్నా శిస్తా అను విషయమునకూడ అభిప్రాయ భేదములు గలిగినవి. (1) సంపూర్ణముగ శిస్తే అని చెప్పదగిన ప్రదేశములు కొన్ని లేకపోలేదు. పట్టణములలోని స్థలములపై విధింపబడు పన్నులును, బర్మాలోని పలుప్రదేశములందలి భూములపై విధింపబడు పన్నులును శిస్తులనదగును. కాని సామాన్యపు సందర్భములలో భూమిపన్నును పన్నుగా పరిగణించుట కనేక కారణము లున్నవి. ప్రభుత్వము భూమియంతయు తమదేయని పూర్వమెన్నడును

1. Moore's Indian Appeal Cases Vol. I. Freeman & Fairlie 1828.
2. Macpherson's Indian appeals Vol. I. 1873-74 p. 282-315.

వాదించి యుండలేదు. శాశ్వతపు ఫైసలా జరిగిన భూములపై హక్కు శాశ్వతముగ నిత రుల కీయబడినది. రైతువారీ భూములలోని రైతుకు సంపూర్ణమైన దాన విక్రయాధికార ములు గలవు.

(౨) మన భూమిపన్ను శిస్తేగాని పన్నుగాదనుట కింకొక కారణము చూపబడు చున్నది. ఏమనగా:— ఫైసలా జరుగు కాలమునందు తప్ప ఇతర సమయములందు ప్రభుత్వము ఇష్టమువచ్చినట్లు పన్నులను హెచ్చింపజాలదు. తగ్గింపజాలదు. ఒకభూస్వామి తనభూమి నైదేండ్లకాల మొకనికి కౌలుకిచ్చె ననుకొందుము. ఇక నతడా ఐదేండ్లకాలమును తన శిస్తు మొత్తమును హెచ్చింపజాలడు. తగ్గింపజాలడు. పైగా మందముమ్మరులు మొదలగు విష యములందు తన కిష్టమైనయెడల రైతుకు కొన్ని సదుపాయములను జేయుటయు గలదు. అట్లే ప్రభుత్వముగూడ రైతులకు తక్కువవడ్డీకి అప్పులనిచ్చుట, బీడుభూములను శిస్తులే కుండ వాడుకొననిచ్చుట మొదలగు సదుపాయములను జేయుచున్నారు. పన్నువిధించు ప్రభుత్వలక్షణ మదిగాదు. ద్రవ్యాపేక్షముగా గావలసినయెడల పన్నులను హెచ్చించుటకును అక్కరలేనియెడల తగ్గించుటకును ప్రభుత్వమున కధికారముండును. అట్టి అధికారము బ్రిటిషు ప్రభుత్వమునకు లేనందువలన భూమినుండి వసూలుచేయబడు పైకము శిస్తుగాని పన్నుగాదని కొందరి యుద్దేశము. కాని భూస్వామికుండవలసిన లక్షణము లనేకము మన ప్రభుత్వమునకు లేవనియును, భూమినుండి పైకమును వసూలుచేయు విధమంతయును పన్ను మొత్తమును వసూలుచేయుటను సూచించును గాని శిస్తుమొత్తమును వసూలుచేయుటను సూచించదని యును ఇందుకు సమాధానము చెప్పబడుచున్నది.

(౩) మొదట ఎట్లుండెనోగాని ప్రస్తుతము భూమి చేతులుమారునప్పుడు దానిపై విధింపబడినపన్ను మొత్తము ధరలో చేరుచున్నది. అందువలన ప్రస్తుతము పన్ను చెల్లింప వలసిన వారికది పన్నుగానె వర్తింపదనుటకు మూడవకారణము. కాని స్థిరాస్థులపై విధింప బడుపన్నులన్నిటి స్వభావమును ఇంతేయని ఇందుకుసమాధానము చెప్పుచున్నారు.

అసలు "పన్ను" "ప్రాప్రయిటరు" అను పదముల అర్థమువిషయమై అనేక అభి ప్రాయభేదము లున్నప్పుడు ఈసంగతులు కింత తేలికగా సమాధానము చెప్పుటకు వీలులేదు. పన్నునుచెల్లించు వానినిబట్టి అతడు చెల్లించునది పన్నా శిస్తా అను విషయమునుగూర్చి అభిప్రాయభేదములు కలిగినను దేశముయొక్క ఆదాయమునందు అంత భాగము తగ్గిపోవు చున్నదిగావున దేశమొత్తముపై పన్నుల ఫలితమునుగూర్చి మన మాలోచించునప్పుడు భూమి పన్నునుగూడ గమనింపవలెనని కమిటీవారందరును ఒప్పుకొనిరి.

# మాదిగవాడు

(ఆంగ్లములోని ఒకకథ కనువాదము)

శ్రీ లీలాసరోజిని

౧

ఒకవంతెన దగ్గర మాదిగవాడొకడు కూర్చున్నాడు. యౌవనం చేత వాడిదేహం మిసమిస లాడుతున్నది. వాడిపక్కన ఒక యువతి కూడా కూర్చున్నది. వీళ్లముఖాలుచూస్తే యిద్దరూ తమహృదయాలను ఆనందదేవతకు పీఠాలుగా చేసినట్లు కనబడుతుంది. వీళ్లిద్దరూ భాగస్వాములని చూడగానే తెలుస్తుంది.

ఆనందమయమైన చూపులతో, తనకు కావలసినవన్నీ భార్య అందిస్తుండగా చిరునవ్వు నాట్యంచేస్తున్న పెదవులను విప్పి మధురముగా పాడుతూ ఆమాదిగవాడు చెప్పులుకుడుతున్నాడు.

ఇట్లా సంతోషంగావున్న యీదంపతుల నావ్రూరిరాజు చూశాడు. ఈయన కెంతధనమున్నా సంతోషములేదు. ముఖమెప్పుడూ దుఃఖాచ్ఛాదితముగానే వుంటుంది. కాంతివిహీనమయిన కండ్లతో వీళ్లను చూచి "నేను కోటీశ్వరుడను. వీడమిత దరిద్రుడు. నాకానందములేదు. వీడు దాని ననుభవిస్తున్నాడేమి? దినమంతా నే నేవిధంగా గడపినా నన్నడ్డుపెట్టేవాళ్లులేరు. నాకొక్కదినమయినా పాడవలెననేబుద్ధి పుట్టదెందుకు? నేనొకసంజ్ఞ చేసినంత మాత్రాన్నే వీడి తల ఎగిరిపోతుంది. వీడు దానిని తెలుసుకోకుండా అమాయకుడుగా ఉండబట్టి యీవిధమయిన ఆనందాన్ని అనుభవిస్తున్నాడా? వాడి భార్యకు వాడిమీదవుండే భక్త్యానురాగాల కంతులేదే! చక్కని నిరాడంబరమయిన జీవితాన్ని గడుపుతున్నారు. నాకు వీళ్లకున్నంత మానసికానందము లేదేమి? అనుకొని ఒకనిట్టూర్పు విడిచి ఆవీధినుండి వెళ్లిపోయాడు.

రాజు హృదయంలో తనకన్నా ఆమాదిగవాడు ఎక్కువ ఆనందాన్ని ఎందు కనుభవిస్తున్నాడో తెలుసుకోవాలనే ఆలోచన బాగా నాటుకుంది. కళ్లు మూసుకొన్నప్పుడంతా ఆ ఆనందమయులు కనబడుతుండేవాళ్లు. క్రమంగా చీకటిపడ్డది. రాజు తన మృదుతల్పము మీద పండుకొన్నాడు. మాదిగవాడినిగూర్చిన ఆలోచన లాయనతలలో ప్రవేశించినవి. తానుగడపిన జీవితమును తలచుకొన్నాడు. యువరాజుగా నున్నప్పుడు ఒకసైనికులాగా వుండేవాడి ననుకొన్నాడు. "భౌతికసౌఖ్యాల నంతముగా అనుభవించాను. కాని నిరాడంబరముగా పాడుతూ మానసికానందముతో ఒక్కరోజైనా గడపలేదు" అనుకొన్నాడు.

తరువాత రాజైనాడు. ఎప్పుడూ రాజ్యానికేఆపదవస్తుందో అనీ తనపైన యెవరైనా కుట్రలు పన్నుతున్నారేమోననీ భయము వేధించుతుండేది. ఇందువల్ల యువరాజుగా వున్నప్పుడైనా శాంతి వుంటే అదికూడా పోయింది. ఆమాదిగవాడెందుకంత శాంతమును సంతోషమును అనుభవించుతున్నాడో ఎంత ఆలోచించినా తెలియలేదు. ఇంతలోకే కొద్దిగా నిద్దరపట్టింది. ఆకలత నిదురలోకూడా వాళ్లమూర్తులే కనబడ్డవి. వెంటనే మెలకువ వచ్చింది. ఆరాత్రంతా నిద్రపోలేదు. తానుకూడా చెప్పులుకుడుతూ పాడుతూవుంటే ఆనందము కలుగుతుందేమో ననుకొన్నాడు. తాను మాదిగవాడినని కొంతసేపు భావించుకొన్నాడు. ఆకాసేపూ సంతోషం కలిగినట్లు కనుపించింది. వెంటనే రాజ్యమును వదిలి చెప్పులు కుట్టుకోవడమా — ఛీ! సిగ్గుమాలినపని అనుకొన్నాడు.

తెల్లవారింది. మళ్లీ మాదిగవాడుండే స్థలానికి వెళ్లాడు. వాడు యధాప్రకారముగానే వున్నాడు.

-౨-

రాజు ఎప్పుడు చూచినా రాజ్యమెట్లా వున్నదోననీ, యువరాజెవిధంగా వుంటున్నాడోననీ, తన పరిపాలనలో యే అక్రమము జరుగుతున్నదోననీ, శత్రురాజు లెవరైనావస్తే తానుముసలివాడననీ, సైన్యము క్రమంగా వున్నదో లేదోననీ, యీవిధమయిన అనేకాలోచనలలో

మునిగి వుండేవాడు. రోజంతా యివే ఆలోచనలు. యిప్పుడొక కొత్త ఆలోచనకూడాను. అది మాదిగవాడంత ఆనందమెట్లా అనుభవిస్తున్నా డనేది. ఎంత ఆలోచించినా ఆయన కేమీ తెలియ లేదు. చివర కొక రోజు వాడంతఆనంద మనుభవించడాని కేదోరహస్యముం దనుకొని వాడిదగ్గరకు వెళ్లి తెలుసుకుందామని బయలుదేరాడు.

ఈయన వాళ్లుండే స్థలానికి వెళ్లేటప్పటికి వాళ్లు పనిముగించుకొని యింటికి వెళ్లబోతున్నారు. రాజును చూచి సాగిలపడి మ్రొక్కారు. ఇది వరకు రాజు వీళ్లను చూచినప్పుడు మారువేషంతో వున్నాడు. అందు చేత వీళ్లకాయన రాజని తెలియలేదు. ఈసారి మారువేషంతో లేడు. రాజును చూడగానే మాదిగవాడికీ వాడిభార్యకూ భయంవేసింది. ఆభా వం వాళ్లిముఖాలలో స్పష్టంగా కనబడ్డది. రాజు వాళ్లను లెమ్మనమని యీవిధంగా అడిగాడు.

"నెలకెంతసంపాదిస్తావు?"

"ప్రభూ! నాఅపరాధం మన్నించండి. నేనెప్పుడూ నా ఆదాయాన్ని లెక్క పెట్టలేదు. నేనెప్పుడూ యీరోజెట్లాగడుస్తుందా అని ఆలోచించ లేదు. మీఅనుగ్రహంవల్ల మాపొట్టలుగడుస్తున్నవి" అన్నాడు మాదిగ వాడు.

"సరే రోజుకెంతసంపాదిస్తావు?" అని రాజడిగాడు

"ఒకరోజుతక్కువ ఒకరోజుఎక్కువ వస్తుంది" అని జవాబిచ్చాడు.

"ఎక్కువ వచ్చినరోజు డబ్బేమిచేస్తావు?" అని అడిగాడు రాజు.

"ఎక్కువ వచ్చినరోజుకూడా అంతా ఖర్చుపెట్టుకొంటాను. క్షమిం చండి" అన్నాడు.

"తక్కువ వచ్చినప్పుడెట్లాగడుపుకొంటావు?" అని రాజడిగాడు.

"అట్లాగే గడుపుకొంటాను ప్రభూ" అన్నాడు మాదిగవాడు. రాజు వాడి అమాయకత్వానికి నవ్వుకొని యీవిధంగా అన్నాడు.

"ఈనూరువరహాలు పుచ్చుకో, వీటిని భద్రంగా దాచిపెట్టు. నీ కెప్పుడైనా జబ్బుచేస్తే ఉపయోగపడుతవి"

రాజునోటినుంచి యీమాటలురాగానే ఆనందముతో వాళ్ల ఒళ్లు పొంగిపోయింది. కృతజ్ఞతతో సాష్టాంగ పడ్డారు. తరువాత రాజుగారి రథం అక్కడినుంచి వెళ్లిపోయింది. వాళ్లిద్దరు తమ గుడిసెకువెళ్లి డబ్బు నొకమూల పాతిపెట్టారు. అయితే ఆరాత్రంతా యిద్దరూ నిద్రపోలేదు. తెల్లవారింది. పనిచేసుకోడానికి వెళ్లారు. కాని పాడుతూ సంతోషముతో పనిచేయడంలేదు. ఇద్దరిమనసులలోకూడా యెవరైనా డబ్బుదొంగిలిస్తారేమోననేభయం; ఇంటికి వెళ్లేదాకా తోచింది కాదు. మధ్యాహ్నంభోజనానికివెళ్లి ముందుగా డబ్బున్నదోలేదో చూచి తరువాత భోజనం చేశారు.

ఈవిధంగా రోజూ డబ్బునెవరైనా దొంగిలిస్తారేమోననే భయం వాళ్లను వేధించడము మొదలుపెట్టింది. రాత్రిళ్లు నిద్దరలేదు. దొడ్లో యేదైనాశబ్దమయితే దొంగవస్తున్నాడనుకొనేవాళ్లు. పిల్లి తడకతోస్తే దొంగే అనుకొనేవాళ్లు.

ఇట్లా వీళ్లశాంతీ, ఆనందమూ పోయింది. ఇదివరకు రోజంతా పాడుతుండేవాళ్లు. యిప్పు డొకపాటైనా పాడరు. పాడవలెననేబుద్ధే పుట్టదు. ఎట్లాగైనా రాజుగారి దగ్గరకువెళ్లి ఆయనడబ్బు ఆయన కిచ్చివేసి శాంతంగా వుందామనుకొని ఒకరోజు డబ్బుతీసుకొని రాజనగరుకు వెళ్లారు. అక్కడ పహరావాళ్లు "ఛీ మాదిగవాడికి రాజదర్శనమేమిటిపో" అని తరిమివేశారు. పాపం యేమి చేస్తారు? తిరిగివచ్చేశారు. ఎప్పుడైనా రాజుకనబడదా అప్పుడేయిచ్చివేద్దామని వెళ్లిపోయి, రాజెప్పుడు వస్తాడా అని కనిపెట్టుకొన్నారు.

తర్వాత ఒకరోజు, రాజు వీరేమిచేస్తున్నాడో చూద్దామని వచ్చాడు. దూరాన్నుం వుండగానే పరుగునవెళ్లి సాష్టాంగపడి "ప్రభూ, మీడబ్బు మీరుదయతో తీసుకొని మాశాంతమును, హర్షమును, పాటలను, యివ్వండి. యీదాసులను మన్నించండి" అన్నారు.

రాజు దీనివల్ల మీకు కలిగిన నష్టమేమిటన్నాడు.

"ప్రభూ! దీని నెట్లారక్షించాలా అనే ఆలోచనతో మామన శ్శాంతిపోయింది. ఎప్పుడూ దీని తలపువల్ల మనస్సుకు బాధగా వుండేది. పాడవలెననే బుద్ధిపుట్టేదికాదు క్షమించండి" అన్నారు.

సరే అని రాజాడబ్బుతీసుకొన్నాడు. తీసుకొనేటప్పుడాయన కండ్లు ఆనందముచేత ప్రకాశించినవి. అసాధ్యమయినదానిని సాధించి నట్లుగా మనస్సులో తట్టింది. పెదవులమీాద చిరునవ్వు కనబడ్డది. "వెళ్లు సంతోషంగావుండు" అని మాదిగవాడితోనని తనప్రాసాదానికి వెళ్లి పోయాడు.

3

రాజులో ఒకచిత్రమయిన మార్పు కలిగింది. అడ్డగించుకోలేని కోరిక ఒకటి హఠాత్తుగా మనస్సులో ప్రవేశించింది. ప్రతివాళ్లురాజుగారి లోని మార్పుకనిపెట్టారు. కాని అట్లాయెందుకున్నావని అడగడాని కెవ రికి సాహసంవుంది? రాణీకూడా సాహసించలేదు. రాజుకూడా తన కోరిక నెవరితో చెప్పలేదు. అందరు తననెగతాళి చేస్తారేమో నను కొన్నాడు. అయినా క్రమంగా ఆకోరికను పెంపొందించాడు. ఆకోరిక అపాయకరమయిం దేమీా కాదు. ఆయనకు కావలసినదంతా మానసి కానందము.

ఆయన తరుచుగా కూర్చుని హర్షమూర్తులగు నాదంపతులను గూర్చి తలపోస్తుండేవాడు. కండ్లుమూసుకొని వాళ్లను చూడవలెనని ప్రయత్నించేశేవాడు. ఆయనప్రయత్నము సఫలమయ్యేది. చెట్టుకింద కూర్చుని సంతోషంగా పాడుతూ చెప్పులుకుట్టే ఆమాదిగవాడూ ప్రేమ తో వాడికి కావలసినవన్నీ అందించే వాడిభార్యా కనబడేవాళ్లు. వాళ్లెంత ఆనంద మనుభవిస్తున్నారో ఆయనగ్రహించాడు. ఈఆలోచన లాయనకు సంతోషమును, ఉత్సాహమును కలిగించేవి. వెంటనే రాజ్యమునకై తనకున్న బాధ్యతలు భయాలు తలచుకొని రాజుకున్నంత అశాంతి యింకె వరికీ ఉండదనుకొనేవాడు. చక్కని నిరాడంబరమయిన, బాధ్యతలు లేని జీవితమును గడిపితే యెంతోబాగుంటుం దనుకొనేవాడు.

ఈవిధంగా కొన్నిరోజులు గడిపాడు. అప్పుడప్పుడు రథమెక్కి హాస్యజన్యమయిన చిరునవ్వుతో ఒప్పే ఆముఖాలను చూడడానికి మాదిగవాళ్ళుండే దారిని వెళ్ళుతుండేవాడు. వాళ్ళు వినయంతో రాజుగారికి సాష్టాంగపడుతుండేవాళ్ళు. వీళ్లను చూచినప్పుడంతా రాజులోవుండే కోరిక పైకుబికేది. ఆయనను తొందరపెట్టేది.

౪

ఆరోజు చతుర్దశి. సూర్యుడస్తమించాడు. చంద్రుడు తనకిరణాలను అంతటా ప్రసరింపచేస్తున్నాడు. ఆచక్కని వెన్నెలలో పచ్చిక బయళ్ళన్నీ అందంగా కనబడుతున్నవి. ప్రసూనాలన్నీ వికసించినవి. రాజు తనధవళాశ్వమునెక్కి బయలుదేరాడు. అక్కడున్న సరోవరంలోని కలువలన్నీ రాజురాకచేత వికసించి మనోహ్లాదంగావున్నవి. వాటినిచూడగానే ఆయనకు ఆనందముచేత వికసించిన ఆదివాసులకన్నులు జ్ఞాపకమునకు వచ్చినవి. ఆప్రదేశాన్నుంచి ఆయన యిదివరకు రెండుమూడునాళ్లు యిటువంటి వెన్నెల్లోనే ప్రయాణంచేశాడు. కాని ఆరోజు వెనుకటికన్నా అక్కడున్నవన్నీ యెన్నో రెట్లెక్కువ రమ్యంగావున్నట్లు తోచింది. చక్కని ఆపచ్చిక బయళ్లమీద గుర్రమును త్వరగాపరుగెత్తించినకొద్దీ ఆయనకెక్కువ ఉత్సాహంకలిగింది. ఆయన వెనక పరివారమేమీలేదు. "చీకటిపడకముందే వస్తాను. యెవరూ రావద్దని" ఆజ్ఞాపించాడు. రాజు ఒంటరిగా ప్రకృతిసౌందర్యాన్నిచూచి ఆనందించవలెనని కోరుతున్నాడనకొన్నారు. ఆయనఆజ్ఞ నెవరతిక్రమించ మటుకు సాహసించుతారు?

రాజు రాత్రంతా ప్రయాణం చేస్తూనేవున్నాడు. తెల్లవారేటప్పటికొక అడవిలోనున్నాడు. ఆయన కిరుప్రక్కలవున్న పెద్దచెట్లను చూశాడు. అవి చాలాగంభీరంగాను, మౌనంగానువున్నట్లు తోచినవి. తానుకూడా అట్లాగే సకష్టసుఖాలను వెల్లడిచేయకుండా గంభీరంగా వుండవలెననుకొన్నాడు. అక్కడ యీర్ష్య క్రోధము పేరాస మొదలయినవాటి కవకాశం లేదనుకొన్నాడు. ఈవిధంగా ఆలోచిస్తుండగా,

అలసిపోయిన ఆగుఱ్ఱం రాలి యెండిపోయిన ఆకులమీద చక్కని గలగలమనేధ్వని కలిగించుతూ నెమ్మదిగా వెళ్లుతున్నది.

చీకటిపడేటప్పటి కొకపల్లెటూరి పొలిమేరకు చేరుకున్నాడు. ఆవూరిలోని చిన్నదీపాలు మినుకుమినుకుమంటూ నక్షత్రములవలె కనబడుతున్నవి. రాజు గుఱ్ఱాన్ని అక్కడి బయల్లమీదికి విడిచిపెట్టాడు.

౫

కృష్ణపురానికి ఒక మాదిగవాడు కొత్తగావచ్చాడు. వాడికి పని అంతబాగా చేతకాదు. అయినా చుట్టూ పాతచెప్పులుపెట్టుకొని ఒక పెద్దచెట్టుకిందకూర్చుని బాగుచేస్తుండేవాడు. మధ్యమధ్య తననెవరైనా చూచి కనుక్కొంటారేమోనని యిటుఅటు చూచేవాడు. వెంటనే ఒక విధమైన లజ్జ కలిగేది. అదిపోయి భయము వేసేది. రోజులుగడిచిన కొద్దీ మాదిగవాడికి భయముపోయింది. చిరునవ్వునవ్వుతూ ఆనందముతో పాడుకుంటూ చెప్పులుకుట్టుకునేవాడు. ఎవరూకూడా వాడెవరో ఎక్కడి నుంచివచ్చాడో తెలుసుకోలేదు.

అంతా క్రమంగానే జరిగిపోతున్నది. ఆమాదిగవాడూ వాడి భార్యా యెంత ఆనందమనుభవించుతున్నారో యీమాదిగవాడుకూడా అంతఆనంద మనుభవిస్తున్నాడు. వాడిలాగానే పాడుతూ చిరునవ్వు నవ్వుతూ చెప్పులుకుట్టుతుండేవాడు. అయితే ఒక్కదానిలోమట్టుకు భేదముంది. ఆమాదిగవాడిపక్కన వాడికష్టసుఖాలు పంచుకొనేభార్య వుంది. కృష్ణపురంలోమాదిగవాడిపక్కన తన కష్టసుఖాలు పంచుకొనే భార్య లేదు.

కృష్ణపురంలోవుండే మాదిగవాడు ముసలివాడైనాడు. ఒకరోజు జబ్బుచేసింది. ఆమరునాడెవరికీ కనబడలేదు. అందుకని కొందరు వెళ్లి గుడిసెతలుపు తెరిచారు. మాదిగవాడి శవం కనబడ్డది. ఆనాడే రాజుగారెక్కడికిపోయినారని వెతుక్కుంటూ వచ్చిన రాజభటులు యీశవంలో రాజుగారి చిహ్నాలు కనిపెట్టారు.

# పురుషసూక్తము: ఉత్పత్తి (Evolution)·

గోపరాజు రామచంద్రరావుగారు, ఎం. ఏ.

ప్రస్తుతం ప్రపంచకానికి తెలుస్తున్న విషయాలన్నీ క్రొత్త కాదుట. పూర్వం మన ఋషులకు చాలామట్టుకు తెలుసును అంటారు. నిజమే అయివుంటుంది. ప్రఫుల్లచంద్రరాయిగారు, వ్రజేంద్రనాథసీలుగారు కొన్ని పుస్తకాలు వ్రాసిరి. వాటిలో రసాయన, ప్రకృతిశాస్త్రములలో (సైన్సులలో) ఋషులకుగల అభిప్రాయాలు వెల్లడింపబడ్డాయి. ప్రతిగృహంలోను పాఠంచేసే పురుషసూక్తంలోకూడా గొప్ప శాస్త్రసమ్మతమైన అభిప్రాయాలు కనబడుతూవున్నాయి.

ప్రపంచకం ఏలాగు పుట్టింది? మొట్టమొదట ఏమి వుండెను? కోటానకోట్ల రకములైన వస్తువులు, చెట్లు, జంతువులు, ఏలాగు సృష్టింపబడెను? ఇటువంటి ప్రశ్నల సమాధానంకొరకు శాస్త్రజ్ఞులు (Scientists) ఎల్లప్పుడూ విస్తారం ఆలోచిస్తున్నారు. ప్రస్తుతం పశ్చిమదేశాలలో ప్రబలియున్న శాస్త్రజ్ఞుల అభిప్రాయం ఈవిషయములపై ఏమిటో గ్రహించి, పిదప పురుషసూక్తంలో ఈఅభిప్రాయాలే ఎంతవరకు సూచింపబడినవో విమర్శించెదము.

గాలి, నీళ్లు విభజింపడానికి వీలులేని పదార్థములని కొంతకాలం పశ్చిమదేశశాస్త్రజ్ఞులు అనుకునేవారు. విభజించడం అనగా, ఒకపదార్థానికి కొన్నిగుణములు కలవు. ఆపదార్థానిని, ఈగుణములు కాక వేరే గుణములు వున్న వేరుపదార్థాలలోకి మార్చినట్లయితే "మొదటిపదార్థము విభజింపబడెను" అంటాము. పాలుకాస్తే వెన్న, చల్ల విడదీయవచ్చును. అందుచేత వెన్నగాను, చల్లగాను పాలువిభజింపబడెను.

అంతకంతకు గాలిలో చాలవాయువులు కలిసినవనియు, నీటిలో రెండురకముల వాయువు లున్నవనియు గ్రహించారు. దానితో అభిప్రాయాలు మారినాయి.

నీళ్లను విభజింపవచ్చును గాని, ఈవాయువులను విభజింపలేమట. లోహములూ అటువంటివే. విభజింపడానికి వీలులేని వస్తువుల పేర్లు ఎలిమెంటులు (Elements) వెండి, బంగారం, రాగి, ఇనుము, బొగ్గు, జింకు, సీసం, పాదరసం, బ్రోమీను, ఆక్సిజను (ప్రాణవాయువు), హైడ్రోజను, నైట్రోజను మొదలయినవి ఎలిమెంటులు. ఇప్పటికి రమారమి ఎనభై ఎలిమెంటులు కనిపెట్టబడ్డాయి. ఈఎలిమెంటులే వేరువేరువిధములుగా కలిసి వేరువేరుపదార్థాలు అవుతాయి. రాగి, జింకు కలిస్తే ఇత్తడి అవుతుంది. ఆక్సిజనువాయువు, హైడ్రోజనువాయువు కలిస్తేనీళ్లు అవును. రాగి, టిన్ను, జింకు, సీసం కలిసి కంచు అవుతుంది. ఈలాగున కొన్ని ఎలిమెంటులు కలిసి అయేపదార్థాలను కాంపోండులు (Compounds) అంటారు. నీళ్లు, ఇత్తడి కాంపోండులు. ఈలాగునే, ప్రపంచకంలో చాలా కాంపోండులు వున్నాయి.

సుమారు వందసంవత్సరముల్రకిందట డాల్టనుగారు ఒక అభిప్రాయం వెల్లడించారు. ఎంతదూరం విభజించినా ఎలిమెంట్లకు ఆగుణాలే వుంటాయి. ఎంత కరిగించినా బంగారం బంగారమే, వెండి వెండే. కాని కాంపోండులు విభజింపగా, విభజింపగా కొంతదూరంవఱకు వాటిగుణములు వుంచుకొని, చిట్టచివరకు ఏఎలిమెంట్లు కలిసి ఆకాంపోండు అయిందో ఆఎలిమెంట్లుగా విడిపోవును. జింకు, రాగి కలిసి ఇత్తడి అయింది అన్నాము. వేడిచేతగాని, విద్యుచ్ఛక్తిచేతగాని, ఆవిరి చేసి, చిన్నఅణువులుగా ఇత్తడిని విడదీయవచ్చును. ఇట్లు ఒకఇత్తడిముక్కను విభజింపగా ఇత్తడిగుణములు పోయి రాగిగాను, జింకుగానుమారును. అందు చేత రాగి, జింకు ఎలిమెంట్లు చేరితే ఇత్తడికాంపోండు అయింది.

పైన చెప్పిన దానినుంచి మనము గ్రహింపవలసింది ఏమనగా, వెవ్వేరు గుణములతో దరిదాపు ఎనభై రకములయిన ఎలిమెంట్లు ప్రపంచకమునందు కలవు. రకరకములయిన ఎలిమెంట్లు చేరి రకరకములయిన కాంపోండ్లు అవును. ప్రపంచకమందు వస్తువులన్నియు ఎలిమెంట్లుగాగాని, కాంపోండ్లుగాగాని వున్నవి. ఈకోటిరకములయిన వస్తువులకూ మూలాధారము ఆ ఎనభైరకములయిన ఎలిమెంట్లే.




బొమ్మ ౧. ఎలిమెంట్లనుండి కాంపోండ్లు వుత్పత్తి.

ప్రపంచకమందుకల పదార్థముల విభజన చూచినాము. పదార్థములేకాక, శక్తులు (Energy) కూడ ప్రపంచకమందు కలవు. వేడి, వెలుతురు, శబ్దము, జడము (కదులుట), విద్యుచ్ఛక్తి (ఎలక్ట్రిసిటీ), ఆకర్షణ (మేగ్నెటిజము సూదంటురాయికికలదు)—ఇవి శక్తులు. ప్రాణము, మనస్సుకూడా శక్తులే. ఇన్నిరకములయిన శక్తులు ప్రస్నప్పటికీ, ఒకమాదిరిశక్తి ఇంకొకమాదిరికి మారగలదు. వేడి అధికమయితే వెలుతురువచ్చును. కరుగుచున్న బంగారంనుండి వచ్చేకాంతి వెలుతురుగా మారిన వేడియే. కట్టెల రాపిడికి నిప్పు కలుగుట, జడశక్తి వేడిగా మారుటయే. ఎలక్ట్రిసిటీదీపము వెలిగించుచున్నది, పంకాలను త్రిప్పుచున్నది, ట్రాములు పరుగెత్తించుచున్నది. చేతులు చలిచినచో జడశక్తి చప్పట్లు శబ్దముగామారును. మనోశక్తిచేత ఆకర్షింపవచ్చును. ప్రాణము కలుగుట చేత కదలగలము. ఇట్లు ఒకశక్తి ఇంకొకరూపములోనికి సులభముగా మారుచున్నది. కనుక ఈశక్తుల కన్నింటికి మూలమగు శక్తి వుండవలెనని శాస్త్రజ్ఞులు వూహించి ఆమూలశక్తి ఎట్టిదో గ్రహించుటకు ప్రయత్నించుచున్నారు.

సైన్సు మొన్నటివఱకు ఈస్థితిలో వుండెను. ప్రపంచకమందువున్న శక్తుల కన్నింటికి మూలము ఒకశక్తి కలదనియు, వస్తువుల కన్నింటికి మూలము రమారమి ఎనభైరకములయిన ఎలిమెంటు లనియు అభిప్రాయము. ఎలిమెంటులకు, శక్తులకు గలసంబంధము తెలియలేదు. అగాధమయిన అజ్ఞానము ఎలిమెంట్లను శక్తులను విడదీయుచుండెను. ఈరెంటికి వంతెన కట్టగల శిల్పకారులు లేరైరి. హిందూశాస్త్రములను సూక్ష్మబుద్ధిచే పరిశీలించినవారుమాత్రము, "ఎలిమెంటులు, శక్తి ఒకటే" అని నొక్కిచెప్పిరిగాని, ఎట్లో చూపజాలరైరి.

పదిసంవత్సరములనుంచి సైన్సు పోర్లిపోయి పెరుగుచున్నది. హిందూ శాస్త్రజ్ఞుల వూహాలు నిజమయ్యెను. వస్తువులకెల్ల మూలమన్న ఎనభై ఎలిమెంట్లనుకూడా ఎలిక్ట్రిసిటీశక్తిగా మార్చుటకు సులభమయ్యెను

ఉత్పత్తి తెలిసెను. మూలశక్తి అన్నింటికీ ఆధారము. మూల శక్తినుంచి శక్తులు, శక్తులనుంచి ఎలిమెంటులు, ఎలిమెంటులనుంచి కాంపోండులు పుట్టెను. వేరువేరుశక్తులు కాంపోండులు కలసి వేరువేరు ప్రాణులు, వస్తువులు అవుచున్నవి. సిలికాఎలిమెంటు, సున్నముకాం పోండు కలిసి రాయి అవుచున్నది. మనోశక్తి, ప్రాణశక్తి, ప్రోటీనుకాం పోండు, నీరుకాంపోండు, బొగ్గుఎలిమెంటు, ఆక్సిజనుఎలిమెంటు కలిసి జంతువుగాని, చెట్టుగాని అవుచున్నది.

ఉపయోగముబట్టి ప్రాణులకు శరీరములు మారుచున్నవి. ఇట్లు చెట్లకు, జంతువులకు రకరకములైన శరీరములు కలుగుచున్నవి. క్రిమి కీటకాదులనుండి పురుగులు, పురుగులనుండి నత్తగుల్లలు, నత్తగుల్లలనుండి చేపలు, చేపలనుండి కప్పలు, కప్పలనుండి బల్లులు, బల్లులనుండి పక్షులు, మనుష్యాదిజంతువులు బయలుదేరెను. ఇట్లు ఎన్నిరూపములు వున్నను ప్రకృతిఅంతకు ఆదిశక్తియే మూలము. (ప్రక్కపటము చూడుము)

ఈవుత్పత్తిగురించి పురుషసూక్తముయొక్క అభిప్రాయ మేమిటి? పురాతన రచనలందువలెనే పురుషసూక్తమందుకూడ అభిప్రాయములు వుపమానమూలకముగా (Symbolic explanation) తెలుపబడెను. వుపమానము తొలగించి గూఢార్థమునే గ్రహింపవలెను.

పురుషుడనగా ప్రకృతి. ఆప్రకృతి ఉత్పత్తి ధర్మమే పురుష సూక్తము.

శ్లో॥ సహస్రశీర్షా పురుషః సహస్రాక్షస్సహస్రపాత్
సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాఙ్గుళమ్
పురుష ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చ భవ్యమ్
ఉతామృతత్వ స్యేశానః యదన్నే నాతిరోహతి
ఏతావా నస్యమహిమా, అతో జ్యాయాగ్ంశ్చ పురుషః

అర్థం॥ పురుషునకు వేయితలలు, వెయ్యికన్నులు, వెయ్యికాళ్లు కలవు. ఆపురుషుడు విశ్వ మంతయు క్రమ్ముకొని, భూత భవిష్య ద్వర్తమానకాలము లయి అన్నము తిను




బొమ్మ ౨. ఉత్పత్తి—పశ్చిమదేశ శాస్త్రప్రకారము

టచే పెరుగుచు, కనబడుచున్న వస్తురూపమై వున్నాడు. పరిపూర్ణమైన పరమాత్మ అగపడుశక్తికన్న అధికమైనది.

ఎలిమెంటులు, కాంపోండులేకాక తలలు, కన్నులు, కాళ్లు కలిగి వేలకొలది వున్న జంతువులన్నియు ప్రకృతియే. అట్టి ప్రకృతిని పురుషుడని ఉపమానముగా చెప్పబడినది. ఆహారము తినుటచేత జంతువులు పెరుగుచున్నవి. కనుక, పురుషుడే పెరుగుచున్నాడని చెప్పవచ్చును. త్రికాలములుకూడ పురుషుడే (ఎట్లో క్రిందిశ్లోకములో చెప్పబడినది). పురుషుడనబడు ప్రకృతికన్న అధికమగు శక్తి కలదట. ఆ అధికశక్తి ఎట్టిదనగా,

శ్లో॥ పాదోఽస్య విశ్వాభూతాని, త్రిపాద స్యామృతం దివి,
త్రిపా దూర్ధ్వ ఉదైత్పురుషః, పాదోఽస్యేహాభవా త్పునః॥

అర్థః॥ భూతములన్ని (ప్రకృతి అంతా) పరమాత్మలో నాల్గవభాగము. మిగిలిన మూడు భాగములు నాశములేని, స్వప్రకాశమగు పరమాత్మ అయివున్నది. ఈముప్పాతిక భాగమునకు శరీరస్పృశ్యలేదు. పాతికభాగము సృష్టిసంహారములకు లోనై వున్నది.

మూలమగు శక్తినుండి నాల్గవభాగమే ప్రకృతిగా మారెనన్న అభిప్రాయము ఈశ్లోకముబట్టి తెలియుచున్నది. సరిగా నాల్గవభాగమే ప్రకృతిగా అయ్యెనని చెప్పుట కష్టము. ఇది కవియొక్క ఊహ. పాతిక భాగమయిన ప్రకృతియందు మార్పు కలదు. అనగా ఎలిమెంట్లు కాంపోండులుగాను, కాంపోండులు శక్తిగాను మారుచున్నవి. ఒకరూపము విడిచి (సంహారము), ఇంకొకరూపముగా పుట్టుటే (సృష్టి) మార్పు. అందుచేత ఈప్రకృతికి సృష్టిసంహారములు కలవు. తక్కిన మూడుభాగములు మితిలేని స్వశక్తిచే యున్నవి. దానికే పరమాత్మ, బ్రహ్మము, ఆదిశక్తి అని వేరువేరుపేర్లు కలవు. ఆపరమాత్మ ఆదిశక్తిగానే వుండుట చేత మార్పునకు అవకాశములేదు. పరమాత్మ ప్రకృతిగా మారినతోడనే మార్పునకు లోనగును. ప్రకృతిఅంతా ఆదిశక్తిగా మారిపోవుటే ప్రళయం అనెదరు. ప్రకృతియందుగల మార్పుయొక్క ముందువెనుకలు తెలియజేయుటే భూతభవిష్యద్వర్తమానకాలములు. ప్రళయమందు అంతా

పరమాత్మ అగుటచే మార్పు లేదుగనుక భూతభవిష్యద్వర్తమాన కాలములుకూడ లేవు.

తక్కినశ్లోకములుకూడ ఇట్లే అన్వయింపగా, మొదట చేతనాచేతనములు పుట్టెను. వాటిని అనుసరించి పరిపూర్ణుడయిన పరమాత్మ పురుషస్వరూపుడైన జీవుడయ్యెనట. అనగా, మొదటపుట్టిన పదార్థములు ఎలిమెంట్లును, కాంపోండ్లును. ఈపదార్థములు ప్రాణమనోశక్తులతో కూడి ప్రాణముగల దేహములు అయ్యెను. మొదట పుట్టినవారు దేవతలు, మనుష్యులు. తరువాత భూమిపుట్టెను.

శ్లో॥ అద్భ్యస్సంభూతః పృథివ్యై రసాచ్చ,........

అర్థం॥ నీళ్లనుండియు, భూసంబంధమైన ద్రవమునుండియు బ్రహ్మాండము పుట్టెను.

అనగా, భూమి పుట్టేముందు విశ్వమంతా నీరుగాను, ద్రవరూపముగాను వుండెను. భూసంబంధమైన ద్రవము ఏదనగా కరిగియున్న ఎలిమెంట్లు, కాంపోండ్లే. మొదట భూమి వాయురూపముగా వుండెనని లాప్లేసుగారి అభిప్రాయము. ఆవాయువు చల్లారుచు ద్రవరూపము అయినపిదప గట్టిభూమి అయ్యెను. భూమిచల్లారుచుండుటచేత పదిమైళ్ల లోతునుంచి ఇప్పటికిని భూమిలో కరిగిన లోహములు మొదలయినవి కలవు. ఈద్రవమే అగ్నిపర్వతములనుండి వెలువడును.

దేవతలు పుట్టినతరువాత యజ్ఞము చేసిరట. అప్పటికి జంతువులు ఇంకా సృష్టింపబడకపోవుటచేత వారు విరాట్టునే హవిస్సుగాను, పశువుగాను సమర్పింపగానే, ఆయజ్ఞమునుండి గోవులు, గుఱ్ఱములు, మేకలు మొదలగు పశువులు పుట్టెను.

ఈయజ్ఞముయొక్క అభిప్రాయము వింతగా వున్నది. పశువులకన్న ముందు మనుష్యుడు పుట్టెననుట నిజమా? ప్రమాణపూర్వకముగా పరిశీలించిచూడగా మనుష్యునికన్న పశువులే ముందు పుట్టెను. ఇంకొకటి. ప్రకృతిని యజ్ఞమందు హోమముచేయగా, అందునుండి జంతువులు పుట్టెననుటయొక్క అభిప్రాయమేమి? యజ్ఞములలో పశువును

ఇచ్చి సుఖములు తెచ్చుకొనుచున్నాము. పశువును సుఖములకు మార్చినాము. దేవతలయజ్ఞముకు ముందు జంతువులు ఇంకా సృష్టింపబడలేదు. అప్పుడు విరాట్టును యజ్ఞమందు సంహారింపగా, విరాట్టు పశువులుగా మారెను. అనగా, ప్రకృతియందు మార్పులుకలిగి జంతువులుకూడా నెమ్మదిగా వుత్పత్తిచెందెను.

పశువులకన్న మనుష్యుడు ముందుపుట్టెనని ఎందుకు చెప్పబడినది? ఋషి అట్టెనమ్మెనా ? లేక, యజ్ఞమనెడు వుపమానముకొఅకై సరిపుచ్చుటకు మనుష్యుని ముందుగా కవి పుట్టించెనా? శ్లోకములందు ఈమానసయజ్ఞమునకు చాలాప్రముఖత ఇవ్వబడినది. మనస్సునందు గల ఆసక్తి జంతువులయొక్క వుత్పత్తికి ముఖ్యమని హెర్బర్టు స్పెన్సరు గారు చెప్పిరి. ఈఅభిప్రాయమే అప్పుడుకూడ తెలిసియుండుటచేత నేమో మానసయజ్ఞమందు కోరికగురించి విస్తారము చెప్పబడినది. మానసయజ్ఞ మనగా వుత్పత్తియే.

మనుష్యులు, జంతువులు, వస్తువులు ఎట్లు పుట్టినవో పురుషసూక్తమందు ఇంతవఱకు చెప్పబడినది. అప్పటి అభిప్రాయముల ప్రకారము, చంద్రుడు చల్లగానుండుటచే విరాట్టుయొక్క మనస్సునుండి యనియు, స్వర్గము పైనున్నదను అభిప్రాయముచే శిరస్సునుండి యనియు, ఇట్లు వెవ్వేరు విధములుగా ప్రకృతిలోని వస్తువులు విరాట్టునుండి వచ్చినట్లు వుపమానరూపముగా చెప్పబడినది.

తరువాత కార్యనిర్మాణముకూడ కొంచము తెలుపబడెను. ప్రతి మనుష్యునకు తల బ్రాహ్మణుడు, భుజములు క్షత్రియుడు, తొడలు వైశ్యుడు, పాదములు శూద్రుడునట, అనగా ప్రతి మనుష్యునకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రత్వములు కలవు. ఆలోచనాభాగము తలచేయును, భుజములు కాపాడును, తొడలు దేహభారము వహించును, శరీరమునిలుపుటకు పాదములే ఆధారము.

మొత్తముమీద ప్రకృతిఅంతా ఒకమూలశక్తినుండి ఉత్పత్తిఅయినటుల పురుషసూక్తములోకూడా ఇప్పటిసైన్సు చెప్పినలాగునే వున్నది.




స్వయంప్రకాశమగు పరమాత్మ (మూలశక్తి)—

పురుషసూక్తము ప్రకారము.

ఈ గదిలో వ్యష్ణదంతయుకును పురుషుడను పేరు ఇవ్వబడెను.

ఇట్లు చూడగా, సైన్సులో వుత్పత్తికిని పురుషసూక్తమందు చెప్పబడిన ముఖ్యాభిప్రాయమునకును విస్తారము భేదము లేదు. ఇప్పుడు ఉపకరణములతో గ్రహించిన ధర్మములకన్న ఎక్కువగా సూక్ష్మబుద్ధినే ఉపకరణముగా చేసికొని ఋషులు అధర్మములనే గ్రహించిరనుతలంపు. హిందూశాస్త్రజ్ఞుల కందఱకు ఉద్భవము పురికొల్పవలెను. "మాతాతలు గొప్పవారన్న గర్వమేగాని, ఇపుడు "దేహి" అనుచున్నామన్న సంగతి మఱచిపోక పురాతన నాగరికతకు మెప్పుతెచ్చునట్లుగా హిందూ సోదరులు మేల్కొందురుగాత.

కొలంబో. గోపరాజు రామచంద్రరావు.

౫౧౩

# అశ్రుపాతము

కొందరిని మనము చూచినయంతనే వారియెడల మనకు సౌహార్దక్షేర్పడును. కొందరినిచూచిన యంతనే వారియెడల వైరస్యమును కలుగును. ఆ సౌహార్దము నావైరస్యము పూర్వజన్మలనుండి తెచ్చుకొన్నవి.

శ్రీయుతులు చెన్నాప్రగడ సుబ్బారావుగారికిని నాకునుగలమైత్రి యటువంటిది. సుబ్బారావుగారు శ్రీభానుమూర్తిగారి కుమారులు. సుబ్బారావుగారు ఆంగ్లేయ వైద్యమునందు గడిదేరినవాడు. భానుమూర్తిగారి నెఱుగని యాంధ్రుడులేడు. భానుమూర్తి పంతులుగారు నేడువృద్ధులు. వయసులో లోకమును భాషాదేవిని సేవించి వయసు గడచిన తరువాత బ్రహ్మపదార్థమును సేవించుచున్నారు.

వారిది 'శంబరదీవి పేరుపాలెము.' భీమవరమునకు ఆ యూరు మూడు నాల్గామడలలో నున్నది. సుబ్బారావుగారు భీమవరములో వైద్యము చేయుచుందురు.

తండ్రి కొడుకులిద్దరు నిరాడంబరులు. సజ్జనాగ్రగణ్యులు. భుక్తికి లోపములేదు. వంశగౌరవము తెలుగునాటికి వన్నెతెచ్చినది. నెలనాళ్ల క్రిందవరకు ఆసంసారమునకు శ్రీభానుమూర్తిగారి ధర్మపత్ని గతించిన దన్న దుఃఖముతక్క వేరేలోటు లేదు. నెలనాళ్లక్రింద సుబ్బారావుగారి భార్య ప్రసవించి గతించినది.

ప్రసూతి వ్యాధులకు సుబ్బారావుగారు ఘనవైద్యుడు. అనేకమంది మిత్రులైన వైద్యులు వచ్చినారట. రోగములో నెట్టి సందిగ్ధావస్థ కలిగినను దానికి ప్రతిహతముగా మందులు నడిపినారట. కాని యాయుస్సులేక మందులు ప్రతిహతములైనవి.

"అదివరకు 'ఎవరైనను పోయిరని' చెప్పినచో 'తగినశ్రద్ధ తీసుకొనలేదు వైద్యులు' అనెడివాడను. ఇప్పుడు తెలిసినది. ఆయువు కలవారికే వైద్యునితోపని" అని సుబ్బారావుగా రన్నారట.

నేను రెండేండ్లక్రింద వైద్యము చేయించుకొనుచు సుబ్బారావు గారింట నెలనాళ్లున్నాను. ఆయమ గృహలక్ష్మి. మొదట నేను వారి యింట స్నేహితుడను. తరువాత బంధుగుడను. తరువాత సుబ్బారావు గారికి బావమరంది నైనాను. దీనికంతకు కారణము సుబ్బారావుగారా! భానుమూర్తి పంతులుగారా! కాదు. ఆ చనిపోయిన నా చెల్లెలు. ఆ యమయాత్మ ముక్తిత్రోవ పట్టునుగాక.

దుఃఖము చాల చిత్రమైనది. అది యొకటివానిని సంతోషపెట్టదు. కొందరి జీవితములు దుఃఖమయములై పోవును. కొందరు దుఃఖమయజీవులు. వారిదుఃఖమును బయటకు రానీయరు. అట్లు రానిచ్చిన నది వారికిని యానందమీయదు. ఇతరులకు నానందమీయదు.

నాకొక మిత్రుడుగలడు. అతనికి నాకు జీవికాజీవి. అతని హృదయములో శోకాగ్నికుండము లొక వేయియున్నవి. అతడు పైకి నవ్వుచుండును. ప్రేలుచుండును. ఒకమిత్రు డతని నడిగినాడుగదా! ఏమోయి! నీ వెప్పుడింత యుల్లరిచేసెద వేమి! అని. అతడు 'నేను పైకి యింత యుత్సాహము లేనిది తెచ్చుకుని లోనిశోకాగ్ని నన్ను మ్రింగివేయకుండ నన్ను నేను రక్షించుకొనుచున్నాను.' అని సమాధానము చెప్పినాడు.

ఒకకవి తన దుఃఖమయ జీవితమునుగూర్చి పాడుకొనుచుండగా లోక మతనిని నిందించుచున్నది.

లోకము దుఃఖమునుచూచి సహించలేదు. దుఃఖమును మ్రింగ గలశక్తి చాల కొద్దిమందికే యుండును.

దుఃఖమును వైరాగ్య మొక్కటియే జయించగలదు. మానుషమైన శక్తి మించిపోయిన దానినిగూర్చి మనమువిచారించి ఫలితములేదు.

శ్రీ సుబ్బారావుగారికి భానుమూర్తి పంతులుగారికి నా యోదార్పులు. చనిపోయిన యామె దివ్యపథములలో తిరుగుచున్నది. ఆయమ శీలము అంతకు సమర్థమైనది.

ఆయమ తనదివ్యశీలము తనబిడ్డలలో నిక్షేపించి పోయినది.

ఆ పసికూనలలోనే మనకు హృదయశాంతి.

విశ్వనాథ సత్యనారాయణ.